# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్.

Registered No. H-373.

సంపుటి 3 ఫిబ్రవరి 1959—ఫాల్గుణము, శాలివాహనశకము-1880 సంచిక 4

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.




16-1-59 న బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్ర గవర్నరు, ముఖ్యమంత్రి మార్షల్ టిటో దంపతులకు స్వాగతం చెప్పారు.

17-1-59 న గోల్కొండ కోటను తిలకిస్తున్న మార్షల్ టిటో దంపతులు.



# ఆంధ్రప్రదేశ్

ఫిబ్రవరి, 1959.

సంపుటి 3 సంచిక 4

ఫాల్గుణము, శాలివాహనశకము-1880

## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ముఖచిత్రం

'రిపబ్లిక్ డే' సందర్భాన బహూకరణలు : రాష్ట్ర గవర్నరు దిగువవాటిని బహూకరిస్తున్నారు 1. నెల్లూరు జిల్లా అఫీషియేటింగు పోలీసు సబినస్పెక్టరు శ్రీ అర్. పి. నరసింహానికి ఆయన ధైర్యసాహసాలకు పోలీసు పతకం, 2., 3. సి. ఐ. డి. క్రైంబ్రాంచి డిప్యూటీ సూపరింటెండెంటు శ్రీ ఎన్. నరసింహామూర్తి, సి. ఐ. డి. అఫీషియేటింగు పోలీసు ఇనస్పెక్టరు శ్రీ ఎన్. రామచంద్రన్‌లకు వారి ప్రశస్తమయిన సేవకు పోలీసు పతకాలు.

# "సుఖమయ జీవితానికి ఇల్లే పునాది"

ఈయేడు రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు దిగువ సందేశం ఇచ్చారు.

"జాతీయ జీవితంలోని కొన్ని ప్రధానాంశాలను గురించి చింతన చేయటానికి జాతీయ దినోత్సవాల సందర్భంగా మంచి అవకాశం లభిస్తుంది. ఈయేటి రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా మన గృహాలను గురించి ఎక్కువ శ్రద్ధ వహించవలసిందని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. మన సాంఘిక జీవితంలో గృహాలకు అత్యంత ప్రముఖమైన స్థానం వుంది. ఆశ్రమాలలో మిన్నయైన గృహస్థాశ్రమ ధర్మానికి గృహమే పునాది. గృహమంటే కేవలం యిటుక, రాళ్లు, సున్నం, సిమెంటు, యిసుక, మట్టి కలిసిన నిర్మాణం మాత్రమే కాదు. ఎండకూ, వానకూ, గాలికీ తలదాచుకునే చోటు మాత్రమే కాదు. మన సంపదను, యితర ఆస్తులను పదిలంగా దాచుకునే చోటే కాదు. గృహానికి ఒక ఆధ్యాత్మికమైన అర్థం వుంది. మనదారాపుత్ర ప్రేమ సంబంధాలు గృహమనే వాహిక ద్వారా అత్యంత ఉచ్చస్థాయిని అందుకుంటాయి. ప్రతిఫలశూన్యమైన ప్రేమ ఆవిష్కరించబడి, ఆత్మత్యాగ పూరితములైన భక్తితాత్పర్యాలు వికసించి మనం భౌతిక లోకం నుండి ఆధ్యాత్మిక లోకంలో ప్రవేశించటానికి గృహమే మార్గము. జీవితంలో అడుగడుగునా మోహపెట్టే ఇంద్రియ లోలత్వానికి దాసులం కాకుండా అంత శ్శత్రువులమీద మనం యుద్ధంచేసే కురుక్షేత్రమే మన గృహం. గృహజీవితవాతావరణంలోనే మహా మునీశ్వర్లు, శాస్త్రవేత్తలు, వీరులు, రాజనీతిజ్ఞులుగా మానవులు తయారుకావటానికి బీజావాపనం జరుగుతుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే గృహమనే పూలతోటలోనే జాతి మొగ్గ తొడిగి, పుష్పించి పరిమళాలు దశదిశల వెదజల్లుతుంది.

అందువల్ల గృహజీవితంమీద శ్రద్ధ తక్కువ చేయటం మంచి పద్ధతికాదు. యిప్పటికే అది చాలా తక్కువ స్థాయిలో పడినడుస్తున్నది. అది పూర్తిగా హరించి పోతే కలిగే దుష్ఫలితాలను గురించి మనం తీవ్రంగా ఆలోచించుకోవలసిన సమయం ఆసన్నమైంది. ఎడతెగని కార్యక్రమాల్లో మనం నిమగ్నమైవున్నప్పటికీ ఆధునిక జీవితం మీద గృహస్థ ధర్మం యొక్క ప్రభావాన్ని మనం విస్మరించకూడదు. మన కుటుంబంలోని సభ్యులతో ఖులాసాగా కాలక్షేపం చేయటానికి తగినంతకాలం వ్యయపరచటం మన అందరి బాధ్యత. ఒక్కొక్కప్పుడు అర్థరహితంగా వున్నట్లు అనిపించినా, మన కుటుంబంలోని ఆత్మీ



గవర్నరు శ్రీ భీమసేన సచార్.

యులు చెప్పేమాటలను మనం శ్రద్ధగా వినాలి. వారు అర్థరహితంగా, అవివేకంగా మాట్లాడుతుంటే అలా వినవలసిన బాధ్యత మనకు యింకా ఎక్కువవుతుంది. ఎందుకంటే, అప్పుడు వారికి తెలియజెప్పవలసిన అనేక అంశాలు వుంటాయి.

## పిల్లల శిక్షణ

ఆరోగ్యదాయకమైన గృహవాతావరణ ప్రభావం సోకనందువల్లనే నేటి మన సాంఘిక జీవితంలోని నిమ్నోన్నతాలు ఏర్పడుతున్నవి. ఈ శోచనీయమైన పరిస్థితికి తల్లిదండ్రులు చాలా వరకు బాధ్యులు. బైటి వాతావరణం కూడా మన మీద పడుతుందనే విషయం నేను కాదనను. అయినా, సరియైన గృహజీవిత విధానాలలో శిక్షణ లభించినట్లయితే, బైటి వాతావరణ ప్రభావాన్ని సులభంగా తప్పించుకోవచ్చు. సక్రమ గృహజీవిత వాతావరణ ప్రభావం సోకి, సరిగా పెరిగి పెద్దయిన వారు, సాంఘిక వ్యతిరేక శక్తుల ఉనికినే నిర్మూలించ కలుగుతారు. అంటే పిల్లలకు కావలసిన విద్యాభ్యాసం లేకుండానే అంతా చక్కదిద్దుకోవచ్చునని నాభావం కాదు. పాఠశాలా విద్య ప్రధానమైనట్టిదే. సాంఘిక వ్యతిరేక శక్తులతో మన పిల్లలు పోరాడుటకే అది వినియోగపడాలని మనం ఆశిస్తాము. కాని గృహ వాతావరణంలోనే సుశిక్షణ లభించినట్లయితే, యీ కార్యం సుకరమవుతుందనే విషయం గ్రహించవలసిన అవసరంవుంది. సామరస్యపూర్వకమైన వాతావరణం నెలకొన్న గృహమే నిజమైన పాఠశాల. స్వార్థరహిత సేవా భావన, సహకార కృషి, ఓర్పు, పరస్పర అభ్యుదయ కాంక్ష మొదలగు సద్గుణాలన్నీ గృహవాతావరణంలోనే పుట్టి పెరుగుతాయి.

సుఖప్రదమైన ఆనందదాయకమైన గృహవాతావరణం సృష్టించటానికి పాటుపడవలసిందని యీ శుభదినోత్సవ సందర్భంగా తల్లిదండ్రులందరికీ విజ్ఞప్తిచేస్తున్నాను. అటువంటి వాతావరణంలోనే పిల్లలు సత్పౌరులుగా రూపొందుతారు. ఈ విధంగా పిల్లలకు దీర్ఘకాలం క్రమశిక్షణ నేర్పవలసివుంటుంది. ముందు పెద్దలు కూడా క్రమశిక్షణ, ఆత్మనిగ్రహం అలవరుచుకొని, తమ పిల్లలకు సక్రమమైన **శిక్షణ** యివ్వవలసివుంది. మనం ముందుగా భౌతికమైన అనేక విలాసాలను త్యజించి మన పిల్లలకు మార్గదర్శకంగా ప్రవర్తించాలి. మన యింటిని తీర్చిదిద్దుకొనుటకు కృతనిశ్చయతను ప్రసాదించి తద్వారా అనతికాలంలో సోషలిస్టు సమాజస్థాపన లక్ష్యం నెరవేర్చుకొనే శక్తిని భగవంతుడు మనకు ప్రసాదించుగాక.



# "ప్రగతి పథంలో పురోగమిస్తున్నాం"

రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ **ముఖ్యమంత్రి** రాష్ట్ర ప్రజలకు దిగువ సందేశం యిచ్చారు :

భారత రాజ్యాంగం అమలుపరచిన తొమ్మిదవ వార్షికోత్సవమైన యీనాడు చూస్తే అంతర్జాతీయ రంగంలో భారతదేశానికి అత్యున్నత స్థానం లభించింది. స్వాతంత్ర్యలబ్ధికి పూర్వమున్న భారతదేశ స్థితి శైశవావస్థ వంటిదైతే, యీనాటి భారతదేశం బాగా పెరిగి పెద్దైన వ్యక్తిలాగా కనిపిస్తుంది. భారతదేశపు శక్తి సంపదలు కూడా అంతగా కాకున్నా చాలా ఎక్కువగానే అభివృద్ధిచెందాయి. మన కండ్ల ఎదుట ప్రత్యక్షంగా కనిపించే యీ అభివృద్ధి సాధించిన ఘనత ముఖ్యంగా మన ప్రధానమంత్రికే దక్కాలి. భారత రాజ్యాంగంలో పొందుపరచబడిన రిపబ్లిక్ సూత్రాలు వివిధ వర్గాల ప్రజల హృదయాలను ఏవిధంగా మారకొనగలిగినది కూడా యీ అభివృద్ధివల్ల మనకు తెలుస్తూనేవుంది. రాజ్యాంగాన్ని అమలుపరచుటకు పూనుకొన్న నాయకులకు అంతకంతకూ ఎక్కువగా ప్రజలనుండి హృదయపూర్వకమైన సహాయ సహకారాలు లభిస్తున్నవి.

కాని సాధారణంగా సామాన్య మానవుడు తన ఆర్థిక అభ్యున్నతిని బట్టియే దేశాభ్యుదయాన్ని కొలుచుకుంటాడు. అతని జీవన ప్రమాణము క్రమంగా పెరుగనిదే స్వాతంత్ర్యమైనా, ప్రజాస్వామ్యమైనా అతనికి అంతగా అర్థంకావు. భారత ప్రజాస్వామ్య రిపబ్లిక్ లక్ష్యము సోషలిస్టు సమాజమని మనం ఆమోదించటం, యీ తక్షణ లక్ష్యసాధనకే. సాధ్యమైనంత త్వరలో దీనిని సాధించటానికి మనం నిర్మించుకున్న బాటలే పంచవర్ష ప్రణాళికలు. ఈ పురోగమనానికి బలం మన ప్రజలలోని రిపబ్లిక్ తత్వమే. ఎందుకంటే, ప్రజల సమిష్టి కృషివల్లనే ప్రణాళికా పథకాలు, కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమాలు విజయవంతములై యీ మార్గములో మనం ముందుకు పోగలుగుతాము.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రజలు, ప్రభుత్వం కలిసి చేదోడు వాదోడుగా పరస్పర సామరస్యంతో, సహకారంతో పనిచేస్తూ. ఆర్థికాభ్యున్నతి సాధన మార్గంలో పురోగమిస్తున్నారు. క్రొత్తగా ఏర్పడిన రాష్ట్రానికి సహజంగా కలిగే అనేకరకాల సమస్యలను గడిచిన రెండేండ్ల కాలంలో పరిష్కరించుకొని, ఆరంభంలో కలిగిన ప్రాంతీయ భావాలను కూడా మన ప్రజలు పూర్తిగా మరిచిపోయి అంతా ఒకటిగా కలిసిపోయారు. ప్రస్తుతం భారత దేశంలోని ముఖ్య రాష్ట్రాలలో ఒకటిగా యిప్పటికే విద్యుచ్ఛక్తి విద్య, ఆరోగ్యం, కమ్యూనిటీ అభివృద్ధి మొదలగు రంగాలలో చెప్పుకోదగిన ఘనకార్యాలు సాధించి, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ప్రగతి పథంలో పురోగమిస్తున్నది.



ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి.

# రాష్ట్రంలో పంచాయతీ సమితుల నిర్వహణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, అభివృద్ధి కమీషనరు అయిన శ్రీ ఎమ్. పి. పాయ్, ఐ. సి. ఎస్. 24.1.59న ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంనుంచి మాట్లాడుతూ యిలా అన్నారు.

గ్రామాలు, సమాజాభివృద్ధి కేంద్రాల స్థాయిలో ప్రభుత్వ అభివృద్ధి పనులను ప్రజాస్వామ్య విధానంలో వికేంద్రీకరించుటకై యీరాష్ట్రంలో అడ్-హాక్ పంచాయతీ సమితులను యేర్పాటు చేయుటలో కల అర్థాన్ని పరమార్థాన్ని క్లుప్తంగా యీ ప్రసంగంలో చెబుతాను. 1947లో బ్రిటిష్ వారు యీ దేశాన్ని వదలి వెళ్లేవరకూ శాంతి భద్రతలను కాపాడిన్యాయాన్ని సమకూర్చుటే యీ దేశ ప్రభుత్వం యొక్క ప్రధాన బాధ్యతగా వుండేది ఈనాడు ప్రజాసంక్షేమం పరిపాలన యొక్క ప్రాథమిక కర్తవ్యం శాంతి భద్రతల పరిరక్షణ ప్రధానమైనది తప్పని సరి అయినది కూడా అయినప్పటికీ అది ప్రజల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవిత పురోగమనానికి దోహదకారి మాత్రమే ఈ దేశం యింకా గ్రామాల దేశమే కాబట్టి ప్రజా సౌభాగ్యం పెంపొందాలంటే మొట్టమొదట గ్రామీణ ప్రాంతాలపట్ల శ్రద్ధ చూపాలి

మన దేశంలో వ్యవసాయం ప్రాధాన్యాన్ని వేరే నొక్కి చెప్పవలసిన అవసరం లేదు ఎందు వల్లనంటే మన ప్రజలలో అధిక సంఖ్యాకులకు వృత్తి జీవనోపాధి మాత్రమే కాక వ్యవసాయం—దీనిలో పశు పోషణ కూడా చేరివుంది —శతాబ్దాలనుంచీ యీ దేశంలో లక్షలాది ప్రజల మనో భావాలనూ, దృక్పథాన్నీ మలుస్తున్నది భూమిపై ఒత్తిడి యెక్కువ కావడంవల్ల యేర్పడిన లేమి, పాత పడిపోయిన వ్యవసాయ పద్ధతులు, యీ లేమివల్ల కలిగిన కర్మ సిద్ధాంతం యివీ మన మూల సమస్యలు అప్పటికి ఆరు సంవత్సరాలక్రితం ప్రారంభింప బడిన సమాజాభివృద్ధి కార్యక్రమం స్వయముగా గ్రామస్థుల పూనిక, కృషి ద్వారానే గ్రామాల సాంఘిక, ఆర్థిక జీవితాన్ని



ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్. పి. పాయ్.

మార్చుటకు ప్రయత్నిస్తున్నది. ఆ మార్పు గ్రామస్థుల కృషి ద్వారానే యెందుకు సాధించ బడాలంటే, మన గ్రామీణ పథకాల అమలు సఫలం చెందాలంటే యీ మార్పు ఫలితాలు ప్రాథమికంగా యెవరి మీద ప్రసరిస్తాయో వారి పూనిక, ఆలోచన, కృషి అన్నిటిని మించి వారి మానసిక దృక్పథంలో మార్పు అవసరమని యిప్పుడు సర్వసాధారణంగా గుర్తించ బడింది. భౌతిక, నైతిక పురోభివృద్ధి కేవలం పరిపాలన వల్ల లభించే వస్తువు కాదని మా విశ్వాసం.

అందుకే ప్రజాస్వామ్య వికేంద్రీకరణ అనబడే యీ తంతు.

గ్రామ పంచాయతీలు, పంచాయతీ సమితుల ద్వారా మనప్రజల వ్యవహారాలు వారిచేతులలోనే వుంచబడతాయి. అట్టి పంచాయతీ సమితుల యేర్పాటుకి సంబంధించిన శాసనం ఇప్పుడు చేయబడుతున్నది. ప్రభుత్వం శాసన సభలో ప్రవేశపెట్టిన ముసాయిదా బిల్లు యిప్పుడు ఉభయ సభలకు చెందిన సెలెక్టు కమిటీ ముందున్నది. ఈబిల్లు యిటీవల దేశంలో సమాజాభి వృద్ధి కృషిని పరిశీలించిన బల్వంతరాయ్ మెహతా కమిటీ సిఫార్సులు ప్రాతి పదికగా తయారుచేయ బడింది. లక్షలాది ప్రజల జీవితాన్ని మలచేయీ ముసాయిదా బిల్లును గురించి బాగా ఆలోచించి చర్చించాలి. దానిలోని వివిధ ప్రతిపాదనలను సెలక్టు కమిటీ మిక్కిలి జాగ్రత్తగా పరిశీలిస్తుంది. అయితే వివిధ అభివృద్ధి రంగాలలో గ్రామీణ పథకాల భాధ్యతను ప్రజల పైననే వుంచుటలో జాప్యం జరుగరాదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. కాబట్టి తొలి చర్యగా ప్రభుత్వం 1-7-58 న అమలు లోనికి వచ్చిన ఉత్తరువు ద్వారా గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయం, పశుపోషణ, సహకారం మున్నగు విషయాలకు సంబంధించిన ప్రభుత్వ పనులను అనధికార సంస్థలకు అప్పగించాలని నిర్ణయించింది.

ఇప్పుడు తలపెట్టిన బిల్లు శాసన మయినపుడు ఎన్నికయిన సంస్థలు యే విధంగా పని చేస్తాయో యించు మించు అదే విధంగా యీ అనధికార సంస్థలు పని చేస్తున్నాయి. అడ్ - హాక్ పంచాయతీ సమితులని వ్యవహరింపబడే యీ సంస్థలు గడచిన కొన్ని నెలల్లో యెలా పనిచేశాయో తెలుసుకొనే ముందు యీ ప్రతిపాదనలను గురించి క్లుప్తంగా తెలుసుకొనుట మంచిది.

### బ్లాకులు

సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రయోజనానికై రెవిన్యూ జిల్లాలన్నీ అనువయిన పరిపాలనా యూనిట్లుగా విభజించ బడ్డాయి. వాటికి "బ్లాక్‌లు" అనిపేరు. ఒక్కొక్క బ్లాకులో దగ్గరగా 66,000 ప్రజలు వుంటారు. వైశాల్యంలో సాధారణంగా రెవిన్యూ తాలూకాలో మూడవ వంతు వుండే యీ బ్లాకులు స్థానిక ప్రయోజనాలు, ప్రజల సమస్యల పరస్పర అవగాహనల దృష్ట్యా సరయిన పరిమాణంలో వున్నాయని భావించబడింది. ఈ పరిమాణంలో గల యూనిట్లు ప్రతినిధుల ద్వారానే ప్రజల దైనందిన సమస్యల పరిష్కార మార్గాలను ఆచరణ యోగ్యమైన పథకాలుగా రూపొందించి వారికృషి ద్వారానే వాటిని అమలు పరచుట సాధ్యమని భావించ బడింది. ఇప్పుడు సహజంగా పాత తాలూకా బోర్డులు జ్ఞాపకం వస్తాయి. ఈ బోర్డులు చాల సందర్భాలలో విఫలమయిన మాట నిజం. ఎందువల్లనంటే, విస్తీర్ణాలు మరీ యెక్కువ కావడం వల్ల స్థానిక ప్రయోజనాల ఐక్యత కాని, ఒకరి సమస్యల నొకరు అర్థం చేసుకొనుటకాని సాధ్యంకాలేదు. అందువల్ల అందరి మంచికీ సమిష్టికృషి జరగకపోగా యీ సంస్థలు తరచు వ్యక్తులు లేక పార్టీల అధికార ప్రాబల్యానికి పోరాటరంగాలుగా వుండేవి. సత్ప్రయోజన సిద్ధికై యీ యూనిట్లు అంతకంటే చిన్నవి వుండాలనుట స్పష్టం. ప్రజా పరిపాలన మూల యూనిట్లుకాగల గ్రామ పంచాయతీల అధ్యక్షులు లేక సెర్పాంచిలు, కోఆప్టు చేయబడిన అయిదుగురు సభ్యులు పంచాయతీ సమితులలో వుండాలని యిప్పటి వుద్దేశం. కోఆప్టుచేయ బడిన 5 లోను ఒకరు మహిళ గాను మరొకరు షెడ్యూల్డు జాతులు, కులాల ప్రతినిధిగాను వుంటారు. మిగిలిన ముగ్గురు సాంఘిక లేక ఆర్థిక విషయాలలో వారు చేసిన కృషిని బట్టి నిర్ణయించబడతారు. మామూలుగా యెన్నిక తంతు ద్వారా పంచాయతీసమితిలో చేరుటకు యిష్టపడని విజ్ఞానులు, అనుభవజ్ఞులను దానిలో చేర్చుకొనుటకు వీలుగా యీ కోఆప్టు పద్ధతికి వస తికల్పించబడింది. యీపంచాయతీసమితి మూడు సంవత్సరాలు అధికారంలో వుటుంది. దానికి యెన్నికయిన అధ్యక్షు వుపాధ్యక్షులుంటారు. సమావేశాలను వారు యేర్పాటు చేసి నడుపుతారు. పంచాయతీ సమితి పని అంతా 5స్థాయి సంఘాల ద్వారా జరుగుతుంది— ఒకటి వ్యవసాయం, పశుపోషణ, చిన్నరకం నీటిపారుదలలతో వ్యవహరిస్తుంది. రెండవది సహకారం, పొదుపు, కుటీర పరిశ్రమలు, గృహ వసతులతోను,

మూడవది విద్య, ఆరోగ్యం, పారిశుద్ధ్యాల తోను, నాలుగవది, రోడ్లు, భవనాలతోను, అయిదవది పన్నుల విధింపు, ఆర్థిక విషయాలతోను వ్యవహ స్తాయి. వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిధుల నిర్వహణ బాధ్యత మొత్తంమీద పంచాయతీ సమితి అజమాయిషీకి లోబడి వుపసంఘాలకి అప్పగించబడు తుంది. కార్యనిర్వాహక సిబ్బందిలో వివిధ ప్రభుత్వ శాఖలనుంచి పంపబడిన ఖాయమయిన వుద్యోగులు, పనిస్వభావాన్ని బట్టి రాష్ట్రం లేక జిల్లా స్థాయిలో నియమింపబడిన వ్యక్తులు వుంటారు. సమితి ప్రధాన కార్య నిర్వాహకాధికారిగా బ్లాకు అభివృద్ధి అధికారి పనిచేస్తాడు. ముందుముందు అతడు బహుశా "సమితి అభివృద్ధి అధికారి" అని వ్యవహరించ బడ వచ్చు. అతనికి తహసీల్‌దారు హోదా వుంటుంది.

## జిల్లా పరిషత్తులు

ఈ ప్రసంగంలో నేను ముఖ్యంగా పంచాయతీ సమితులు పనిచేసే విధానాన్ని గురించే చెప్పవలసి వున్నా విషయ సమగ్రత నిమిత్తం జిల్లాస్థాయిలో యీ వ్యవస్థను గురించి ఒక్కమాట చెబుతాను. ముసాయిదా బిల్లులో ప్రతిపాదన ప్రకారం జిల్లా లోని అన్ని పంచాయతీ సమితుల అధ్యక్షులు, జిల్లా నుంచి యెన్నికయిన లోకసభ, రాష్ట్ర శాసనసభ సభ్యులు, రాజ్యసభ లేక రాష్ట్ర శాసనమండలి సభ్యులలో కొందరు వుంటారు. పని సమన్వయం ప్రయోజనాలదృష్ట్యా, ప్రభుత్వానికీ యీ సంస్థలకీ మధ్య లైజాన్ యేజంట్లుగా వుండగల జిల్లా కలక్టర్లే జిల్లా పరిషత్తుల అధ్యక్షులుగా వుండాలా లేక ప్రజా స్వామ్య వికేంద్రీకరణ సూత్రాన్ని అనుసరించి పూర్తిగా యెన్నికయిన అనధికారులు వుండాలా అన్న విషయంలో అభిప్రాయభేదమేర్పడింది. కేంద్ర, రాష్ట్ర శాసనసభలకి ఓటుచేసే హక్కు వుండాలా లేదా అన్న విషయంలోకూడా అభిప్రాయభేదాలేర్ప డ్డాయి. ఇటువంటి విషయాలను జాగ్రత్తగా ఆలోచిం చాలి.ఇప్పుడీబిల్లును పరిశీలిస్తున్న సెలెక్టుకమిటీ దానిని పూర్తిగా పరిశీలిస్తుందనుటలో సందేహంలేదు. ఫలి తాలను వూహించాలంటే, యీ పరిషత్తులు సమితు లన్నీ తయారుచేసిన పథకాలను సంఘటితపరచి వాటి కార్యకలాపాలను సమన్వయం చేస్తాయని అనుకో వచ్చు. ఈ పరిషత్తులు సమితుల బడ్జెటులను ఆమో దించి వాటికి అవసరమయిన సహాయంకూడా చేస్తాయి. జిల్లా పరిషత్తు బహుశా జిల్లా స్థాయిలో ప్రణాళికలను తయారుచేసి సమన్వయపరచే సంస్థగా వుంటుంది.

కొత్తపద్ధతి ఆడ్‌హాక్ పంచాయతీ సమితులు పని ప్రారంభించి ఆరునెలలు దాటింది. ప్రభుత్వ వుత్తరువు ద్వారా అవి జిల్లాకొకటి చొప్పున 1-7-58 న 20 యేర్పాటు చేయబడ్డాయి. అవి చేసిన పనికి యిప్పు డిప్పుడే విలువ కట్టలేంకాని గడచిన కొన్ని నెలల అనుభవము ప్రోత్సాహకరంగా వుందనుటలో యేమీ సందేహంలేదు. రెండు మూడు అంశాలదృష్ట్యా యీ ప్రయోగం విజయాన్ని నిర్ణయించవచ్చు. మొదటిది, నిశ్చయంగా, సమితులు చురుగ్గా పని చేయాలి. వాటి సభ్యులు తమ పనిపట్ల అమితమయిన శ్రద్ధ చూపి ప్రజల వాంఛితాలను, ఆశయాలను వ్యక్తపరచాలి. ప్రజాస్వామ్యం యెక్కువగా చర్చ, సమ్మతులద్వారా జరిగే ప్రభుత్వం. అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని వ్యక్తపరిచే ఓట్లతో నిర్ణయాలు తీసుకొనబడ్డం నిజమే. కాని ముఖ్యంగా ప్రయోజ నాల పరస్పర విరుద్ధత, అభిప్రాయభేదాలు యేర్పడే సందర్భాలు తక్కువగావుండే గ్రామస్థాయిలో అది మరీ సంకుచితమయిన ప్రజాస్వామ్య పద్ధతి కాగలదు. కాబట్టి పంచాయతీ సమితుల విజయం ప్రజలకు అవి యిచ్చే సంతృప్తినిబట్టి, అభిప్రాయభేదాలు వచ్చి నప్పుడు, అధికసంఖ్యాకులు కేవలం తమ అభిప్రా యాన్ని నెగ్గించుకొనుటకు బదులు అల్పసంఖ్యాకు లుగా వున్నవారి అవసరాలను అభ్యంతరాలను మన్నించుటకు చేసే కృషినిబట్టి నిర్ణయించవచ్చు మొత్తంమీద యీ రాష్ట్రంలో గడచిన కొన్ని నెలల అనుభవము మిక్కిలి ప్రోత్సాహకరంగా వుంది.

## సత్ఫలితాలు

మొట్టమొదట, హర్షదాయకమయిన అంశం ఒకటి వుంది. గ్రామాలలో సమాజాభివృద్ధి కార్యక్రమాలు సృష్టించే నూతన జీవితం కూడా దానిచే సూచిత మవుతుంది. ఉదాహరణకి, వివిధ సమితులు, స్థాయి

సంఘాల సమావేశానికి సభ్యులు చక్కగా హాజరవు తున్నారు. ఇప్పుడున్న 20 సమితులలోను సభ్యులు సగటున 100 కి 75 కి పైగా హాజరవుతున్నారు. నిజానికి హాజరు సమితులు యేర్పాటుకాని బ్లాకు లలో సలహాసంఘాల హాజరుకంటె కొంచెం మెరుగ్గా వుంది. కేవలం సలహా అడిగినప్పటికంటె తమ తమ అభిప్రాయాలు సరాసరి నిర్ణయాలకి తోవతీసేటప్పుడు యీ సంఘాల సభ్యులు యెక్కువ ఆసక్తి చూపడం సహజం. ఒకటి రెండు సందర్భాలలో తప్ప కోరం లేక సమావేశాలు వాయిదా పడిన సందర్భాలేలేవు. ప్రోత్సాహకరమయిన మరొక అంశమేమిటంటే, ప్రజలు తమ సమస్యలను తరుచు సమితులకు తెలియ చేయగా సమితులు వాటి విషయంలో శ్రద్ధ తీసు కుంటున్నాయి.

వ్యవసాయరంగంలో అధిక తమ ఆసక్తి చూప బడింది. అన్నిసమితులలోను సభ్యులు, సమితులు నియమించిన సంఘాలుకూడా ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రచారం సలిపి, ఆధునిక పద్ధతులు అమలు జరుగుట కవసరమయిన సహాయాన్ని చేస్తున్నారు. ఒక బ్లాకులో వరిపంటలో 60 శాతం జపాను పద్ధతికింద సాగుచేయబడింది. మరొక బ్లాకులో, సమితి ఆహారసమస్య ప్రాముఖ్యాన్ని గుర్తించినందువల్ల రెండవ పంట కాలంలో 800 యెకరాలకి పైగా రాగిపంటకిందికి తేబడ్డాయి. ఇదివరలో అక్కడ అట్టి సాగు అరుదుగా జరిగేది. చాలా బ్లాకులు చీడపురుగుల నివారణకై రసాయన పదార్థాలు మున్నగువాటిని కొని వాటిని అద్భు తంగా వుపయోగించాయి.

ప్రజారోగ్యం విషయంలో కూడా తగినంత శ్రద్ధ గైకొనబడింది. అన్ని సమితులలోను ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు యేర్పాటుచేయబడినవి. ప్రభు త్వం నుంచి ఆశించిన ప్రతిపాదిక సహాయం అనగా 2 యెకరాల భూమి కానుక, రూ. 10,000 రొఖ్ఖంగా విరాళము సులభంగా సంపాదింప బడ్డాయి. ఈ రంగంలో ప్రజల కార్యోత్సాహం మిక్కిలి ఎక్కువగావుంది. విద్యను గురించికూడా అదే మాట చెప్పవచ్చు. నిర్బంధ ప్రాథమిక విద్యా పథకం గురించి పెక్కు సమితులు విస్తృతంగా ప్రచారం సలిపాయి. ఒక బ్లాకులో ప్రాథమిక పాఠశాల యేర్పాటుకై గ్రామస్థులు 40 భవనా లకు పైగా యిచ్చారు. ఇతర అభివృద్ధి కార్య కలాపాలకి కూడా ప్రజాసహకారం అధికంగా లభిస్తున్నది. కేవలం సలహాకు వుద్దేశించబడిన అనధి కార సంస్థలు గల బ్లాకులలో కంటె పంచాయతీ సమితులు యేర్పాటయిన బ్లాకులలో ప్రజల విరా ళాలు యెక్కువగా లభిస్తున్నాయిట. ఒక బ్లాకులో గత 6 నెలల్లోను వివిధ అభివృద్ధి కార్యక్రమాలకై రూ. 55,000 కి పైగా ప్రజల విరాళంగా వచ్చాయి. వరదల భీభత్సానికి గురయిన మరొక బ్లాకులో, వరదబాధితుల సహాయార్థం రూ. 3,000 రొఖ్ఖం, ధాన్యం, పశుగ్రాసం, గృహనిర్మాణ వస్తు వులు సేకరించబడ్డాయి. అట్టి ధర్మం, సహాయం మన దేశానికి కొత్త కాదు. కాని అది అంత శీఘ్ర కాలంలో సాధించబడుట విశేషమే. సమితి బ్లాకు లన్నిటిలోను పొదుపును ప్రోత్సహించి వెనకవేసిన సొమ్మును పంచవర్ష ప్రణాళికకు మళ్లించుటలో మంచి కృషి జరిగింది.

రాష్ట్రంలో సమాజాభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు యింతమేరకు పాల్గొంటున్నారంటే అది ఆ కార్యక్రమాల వుపయోగాన్ని శంకించే విమర్శకు లకు గట్టి జవాబు అని చెప్పడం యిక్కడ సందర్భో చితం. 1958 చివరివరకు యీ రాష్ట్రం యీ కార్యక్రమాలపై రూ. 9 కోట్లు ఖర్చుచేసింది. ప్రజలు రొఖ్ఖం, వస్తు, శ్రమ రూపాలలో రూ. 5 కోట్లు యిచ్చారు. ఇండియావంటి నిరుపేద దేశంలో అందులోను ఆర్థికవిషయంలో అతిబలహీను లయిన వారిచే అంత విరాళం యివ్వబడిందంటే అది గ్రామాభివృద్ధి కేర్పడిన ప్రస్తుత కార్యక్రమాలపట్ల ప్రజల వుత్సాహాన్ని సూచిస్తుంది. ఈ విరాళాలు యితర ప్రాంతాలలోకంటె సమితి ప్రాంతాలలో యెక్కువగా వున్నాయని మా లెక్కలవల్ల తేలింది. ఇది శుభసూచన.

ఇదివరకే చెప్పినట్లు యీ పంచాయతీ సమితులు పని ప్రారంభించి యెంతోకాలం కానందున వాటి లాభనష్టాలను గురించి యిప్పుడే యేమీ చెప్పలేము. మన మొదటి అభిప్రాయాలు నిజమనీ, అవి యెప్పు

తూ అలాగే వుండగలవనీ మాత్రం ఆశించవచ్చు. గ్రామీణ ప్రజానీకం తమ సమస్యలను గుర్తించి వాటి పరిష్కారంలో స్వయంకృషి ప్రభావాన్ని అవగతం చేసుకొనుటకు వీలుగా సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రారంభింపబడింది. గ్రామ ప్రాంతాలలోని లక్షలాది కుటుంబాలు తమపట్ల, తమ యిరుగు పొరుగువారి పట్ల కలిగివుండే దృక్పథాన్ని మార్చి, స్వయంపూనిక, కృషుల ద్వారా యెక్కువ ఆనందంగా సంపన్నంగా జీవించే అవకాశం కలుగ చేయుట యీ కార్యక్రమంయొక్క మూలాశయం. అంతటా కాకపోతే పెక్కు ప్రాంతాలలోనైనా అట్టి పూనిక, కృషి యిప్పటికే వునికిలోకి వచ్చాయనుటలో సందేహం వుండకూడదు. ఈ పూనికను, కృషిని సమీకరించి సమాజాభివృద్ధి కార్యక్రమం పూర్తి బాధ్యతలను ప్రజలపైనే వుంచే ప్రయత్నములో యిప్పుడు మనం రెండవ ఘట్టంలో ప్రవేశించాం. దేశంలో స్వయం పాలనను మరో ప్రతిపాదిక పై యేర్పాటు చేయుటకు వీలులేదు. చారిత్రిక, రాజకీయ కారణాలచే దేశంలో ప్రజాస్వామ్యం 1947లో పై నుంచి ప్రారంభమయినా, అట్టడుగున సరిగా నాటుకొంటేనే అది దృఢంగా వుంటుంది. భారతదేశంలో యే ప్రజాసామ్య వ్యవస్థకయినా పునాది గ్రామంలో పడాలి. శతాబ్దాలక్రితం భారత దేశం నాగరికతలో అగ్రగామిగా వున్నప్పుడు దాని స్థైర్య సౌభాగ్యాలు చాలవరకు గ్రామసమాజాల సత్వంపై ఆధారపడి వుండేవి. ఈ సమాజాలకు స్వయం సహాయం, సహకారం అనే రెండు ముఖ్య సూత్రాలు ప్రతిపాదికగా వుండేవి. ప్రజాస్వామ్యానికి మళ్లీ విశాలమయిన పునాది యేర్పరచి దాని మూలాన్ని ప్రజలలో దృఢంగా నాటి తద్వారా యీ దేశంలో ప్రజాస్వామ్యం భవిష్యత్తును భద్రపరచుటకై అడ్ - హాక్ పంచాయతీ సమితులు యేర్పరచబడ్డాయి.

—ఆలిండియా రేడియో సౌజన్యంతో.





17.1.59 న గ్రీన్‌లాండ్సులో మార్షల్ టిటో రాష్ట్ర ముఖ్యమంత్రితో అల్పాహారం సేవించారు ఆ సందర్భంలో ముఖ్యమంత్రి కుమారుడు మార్షల్‌ని పుష్పమాలాలంకృతుని చేస్తున్న దృశ్యం.

# హైదరాబాదుకు మార్షల్ టిటో ఆగమనం

యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటోకు స్వాగతం చెప్పే అవకాశం హైద్రాబాదు పౌరులకు 1959 జనవరి 16, 17 వ తేదీలలో కలిగింది. టిటో ప్రయాణం చేసిన మార్గాలలో జనం తండోప తండాలుగా కూడారు వారికి పౌర సన్మానం జరిగిన సందర్భంలో వచ్చిన జనం అంతా ఇంతాకాదు వారి రాకతో యుగోస్లావియా పట్ల మనకు ఏర్పడిన గాఢ స్నేహాభావాన్ని ఈ సంఘటనలు వ్యక్తం చేశాయి

అధ్యక్షుడు టిటో, వారి సతీమణి మేడమ్ జోవాంకా బ్రోజ్ 1959 జనవరి 16 వ తేదీ మధ్యాహ్నం కొత్తఢిల్లీ నుంచి విమానంలో హైద్రాబాదుకు వచ్చారు వారు నగరంలో రెండు రోజులు గడిపారు టిటో పరివారం ప్రయాణం చేసిన యుగోస్లావియా విమాన రవాణ సంస్థకు చెందిన విమానం నిర్ణీత సమయానికి 55 నిమిషాలు ఆలస్యంగా పగలు 12 35 గం. లకు బేగంపేట చేరింది

గవర్నరు శ్రీ భీమసేన్ సచార్, ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గారలు వరుసగా వారికి స్వాగత మిచ్చి పూల మాలలు వేశారు.

శ్రీమతి సచార్, శ్రీమతి సంజీవరెడ్డి గారలు మేడమ్ బ్రోజ్‌కి పూల మాలలు వేశారు విమానాశ్రయావరణ పతాకాలతో శోభానమాయంగా అలంకరించ బడింది.

మార్షల్ టిటో ప్రత్యేకంగా పరిచిన తివాచీ మీది నుంచి నడుస్తూ వందన స్వీకారం చేసే వేదిక వద్దకు వెళ్ళారు. అచ్చటి నుంచి వారు మేజర్ జి. యస్. హారికా అధ్వర్యాన అయిదవ బటాల్యన్, 11 వ గూర్ఖా రైఫిల్స్‌లు సమర్పించిన వందనాన్ని స్వీకరించారు. వందన స్వీకారం జరుగుతుండగా బ్యాండు వాద్యాలు, యుగోస్లావియా జాతీయ గీతమైన "హెజ్ స్లావెనియా" నీ, భారత జాతీయ గీతమైన "జన గణ మన" నీ ఆలాపించారు. తరువాత వారికి ప్రముఖ వ్యక్తులను ముఖ్యమంత్రి పరిచయం చేశారు. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. పి. పాయ్, మేడమ్ బ్రోజ్‌కు ప్రముఖులను పరిచయం చేశారు. శాసన సభ సభ్యులనూ, ఇతర ఆహూతులను కలవడానికి మార్షల్ టిటో బయలుదేరినప్పుడు "మార్షల్ టిటో జిందాబాద్" అన్న నినాదాలతో ఆ ప్రాంతం మారుమోగింది.

ఆచ్ఛాదనగల కారులో గవర్నరుతో కలసి మార్షల్ టిటో రాజభవన్‌కు వెళ్ళారు. అయిదు మైళ్ళ మార్గంలో రోడ్డుకిరువైపులా చేరిన క్రిక్కిరిసిన జనం హర్షధ్వనాలు చేశారు. "జివ్యో మార్షల్ టిటో" (మార్షల్ టిటో జిందాబాద్), "దాబ్రోదోసద్" (సుస్వాగతం) అని వ్రాయబడిన ఆర్చీలు మధ్య మధ్యన నిర్మింపబడినవి. అధ్యక్షుడి బృందం వెంట విదేశ వ్యవహారాల శాఖ ఉపమంత్రిణి శ్రీమతి లక్ష్మీమేనన్, యుగోస్లావియాలో భారత రాయబారి అయిన దుసన్ క్వేదార్ తదితర భారత ప్రభుత్వ ప్రతినిధులు వున్నారు.

## పౌరసన్మానము

హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాల పురపాలక సంఘాలు, మార్షల్ టిటోకు పౌర సన్మానం చేశాయి. స్వాగత పత్రానికి సమాధానమిస్తూ మార్షల్ టిటో అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించడానికి భారత దేశ నాయకులు



బేగంపేట విమానాశ్రయంలో గౌరవవందనాన్ని తనిఖీచేస్తున్న మార్షల్ టిటో (16-1-59).



1౮-1-౫౯ న హైదరాబాదు, సికిందరాబాదు మేయర్లు మార్షల్ టిటోకి స్వాగత పత్రం సమర్పిస్తున్న దృశ్యం

ముఖ్యంగా ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ చేస్తున్న కృషిని ఈ దేశ ప్రజలు ఎంతో అభినందిస్తున్నారన్నారు. మానవాళికి ముప్పు తెచ్చి పెడుతున్న ఆయుధాల నిర్మాణ పోటీ నివారణకు భారతదేశం సాగిస్తున్న అవిరళ కృషిని యుగోస్లావియా ప్రజలు కొనియాడుతున్నారని కూడా టిటో అన్నారు.

ఈ స్వాగత సభలో అత్యధిక సంఖ్యలో జనం పాల్గొనుటకు వీలుగా ఆరోజు విద్యాసంస్థలకు సెలవు యివ్వబడింది. ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే ఉద్యోగులకు సభకు హాజరగుటకు అనుమతి యివ్వబడింది. ట్రాఫిక్ ఐలెండులూ, ముఖ్య స్థావరాలు తోరణాలతో పూలతోట్లతో సుందరంగా అలంకరింపబడినవి. ఉభయదేశాల పతాకాలు విరివిగా ఎగురవేయబడినవి.

మార్షల్ టిటో, వారి పరివారం సా 6 గంటలకు సభాస్థలికి చేరగానే అచ్చటకూడిన అశేష ప్రజానీకం జయజయధ్వనాలు చేశారు. ప్రసంగానంతరం వారు చేతులు ఊపుతూ ప్రజలకు ధన్యవాదాలు తెలియజేశారు. మార్షల్ టిటో సైనికదుస్తులు ధరించారు. గవర్నరు వారివెంట వున్నారు.

టిటో కారుదిగగానే ఉభయ కార్పొరేషనుల సభ్యులకు పరిచయం చేయబడినారు. రంగురంగుల విద్యుద్దీపాలతో సుందరంగా అలంకరింపబడిన సభామంటపం ప్రవేశిస్తూ వారు ప్రజలకు ప్రత్యభివందనం చేశారు.

ఉభయ కార్పొరేషనుల మేయర్లు టిటో దంపతులకు పూలు దండలువేసి స్వాగతపత్రాలను ఒక పేటికలో పెట్టి సమర్పించారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్ సంజీవరెడ్డి, ఇతర మంత్రులు, శ్రీమతి లలితా సచార్ ప్రభృతులు సన్మానసభకు వచ్చారు.

## సాలార్‌జంగ్ మ్యూజియం సందర్శన

టిటో దంపతులు నగరంలోని సాలార్‌జంగ్ మ్యూజియంను చూస్తూ ఒక గంటసేపు గడిపారు. అనేక దేశాలకూ, వివిధ కాలలకు చెందిన ప్రదర్శన వస్తువులపట్ల వారు చాలా ఆసక్తిని కనబరిచారు.



17-1-59 న మార్షల్ టిటో సాలార్ జంగ్ మ్యూజియంలో చలువరాతి విగ్రహాన్ని పరిశీలనగా చూస్తున్నారు.

ప్రదర్శనంలోని ముఖ్య కళాఖండాలన్నింటినీ వారు చూశారు. జి. బి. బెంజోనీ (1876) తయారుచేసిన రచ్చల్ (ముసుగులో) చలువరాతి ప్రతిమ ముఖ్యంగా వారి దృష్టిని ఆకర్షించింది. ఈ ప్రతిమను కీ. శే. సాలార్ జంగ్ ఆరువేల పౌనులకు కొన్నాడట. మఫిస్టాఫెల్స్, మార్గెరెట్టాల కొయ్యప్రతిమకూడా వారి దృష్టిని ఆకర్షించింది. జేడు గదిలోని ప్రదర్శన వస్తువులు కూడా వారికి బాగా నచ్చినవి.

## రాజభవన్‌లో ప్రభుత్వవిందు

టిటో దంపతుల గౌరవార్థం రాజభవన్‌లో ప్రభుత్వవిందు ఏర్పాటు చేయబడింది. ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు, హైకోర్టు న్యాయమూర్తులు, ఉన్నత ప్రభుత్వోద్యోగులు విందుకు వచ్చారు. గవర్నరు శ్రీ సచార్ టిటో దంపతులకు స్వాగతం చెప్తూ "మీ రాకకు జంటనగరాల పౌరులు ఎంతో ఆనందిస్తున్నా"రన్నారు. గవర్నరు ఇంకా ఇలా అన్నారు.

"మాకు మీయెడలగల ప్రగాఢమైన ప్రేమ, గౌరవాలను మా ప్రజలు బుజువుచేసుకున్నారు."

మార్షల్ టిటో సమాధానమిస్తూ యుగోస్లావ్ భాషలో మాట్లాడారు. హర్ ఎక్సెలెన్సీ శ్రీమతి దుసన్ క్వెడిర్ వారి ఉపన్యాసాన్ని ఇంగ్లీషులోకి అనువదించి చెప్పారు. తానూ, తన భార్య నగరంలో చాలా కొద్ది సమయం గడిపినప్పటికీ ఇచ్చట కలిగిన అనుభవాలను తాము మరువలేమని మార్షల్ టిటో అన్నారు. ఉభయనగరాల పౌరులు తమకుచేసిన స్వాగత సత్కారాలు తమకు ఆనందం కలిగించాయనీ, ఈ గౌరవము తమ దేశ ప్రజలకు చేసినదేనని తాము భావిస్తున్నామని వారన్నారు.

శాంతి సాధన కృషి సందర్భంగా తాము ఆసియా దేశాలలో చేస్తున్న పర్యటనలలో అయా దేశ ప్రజలందరూ పూర్తిగా ఉత్సాహం కనబరిచారని పేర్కొంటూ వారందరుకూడా శాంతియుత సాధనాలద్వారా ఉజ్వలమైన భవిష్యత్తును నిర్మించుకోవడానికి తహతహలాడుతున్నవారు కావడమే దీనికి కారణం అని మార్షల్ టిటో అన్నారు. "మన ఉభయదేశాల ప్రజలు యుద్ధాన్ని పూర్తిగా నిరసిస్తారు" అని వారు ప్రకటించారు. వారు ఇంకా ఇలా అన్నారు : "భారతీయులు వారి దేశ నాయకుల అధ్వర్యాన ముఖ్యంగా శ్రీ నెహ్రూ నాయకత్వాన ఉద్రిక్తత సడలింపుకూ, శాంతిసాధనకు ఎంతో తోడ్పడ్డారు. ఈ పర్యటనలో నేను మీ దేశంలో చాలా కొద్దికాలం గడిపినప్పటికీ, మన ఉభయదేశాల మధ్య స్నేహబాంధవ్యాలు బలపడడానికేకాకుండా



రాజభవన్‌లో విందులో జరిగిన టోస్ట్‌కి సమాధానమిస్తున్న మార్షల్ టిటో.



జనవరి 16 న రాజభవన్‌లో సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొన్న కళాకారులతో టిటో దంపతులు.



మార్షల్ టిటో (చార్మినారు పరిసరాలలో).

అంతర్జాతీయ సఖ్యతకుకూడా ఈ పర్యటన తోడ్పడింది."

భారతదేశ ప్రజలు సాధించిన అభివృద్ధికి తమ పక్షానా, యుగోస్లావియా ప్రజల పక్షాన వారికి అభివందనలు తెలుపుతూ, శతాబ్దాల విదేశ పాలనవల్ల కలిగిన అనర్థాలను తొలగించడంలో నగర ప్రజలూ, రాష్ట్ర ప్రజలు కృతకృత్యులు కాగలరని మార్షల్ టిటో ఆశించారు. ఇప్పుడు భారతీయులు సర్వ స్వతంత్రులు, తమ అభిరుచులకు అనుగుణంగా తమ దేశాన్ని తీర్చిదిద్దుకోగలిగారు అని వారన్నారు.

తరువాత సాంస్కృతిక ప్రదర్శనలు జరిగినవి :

## విద్యార్థులకు పిలుపు

విశ్వకల్యాణానికి శాంతి, అంతర్జాతీయ సహకారములు అపరిత్యాజ్యమైనవని, మార్షల్ టిటో 17వ తేదీ ఉదయం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జరిగిన విశ్వవిద్యాలయ విద్యార్థులు, ఉన్నత పాఠశాలల విద్యార్థుల సభలో మాట్లాడుతూ ఉద్ఘాటించారు.

వేలకొద్ది విద్యార్థులు, అనేకమంది విద్యార్థినులు సభకు వచ్చారు. మార్షల్ టిటో విశ్వవిద్యాలయ భవనం వద్దకు రాగానే వారంతా ఒక్కపెట్టున హర్షధ్వానాలు చేశారు. స్నేహదేశమైన భారతదేశమూ, ప్రజలు చిరకాలం వర్థిల్లుదురుగాక అనే మాటలతో మార్షల్ టిటో తమ సంక్షిప్త ప్రసంగాన్ని పూర్తిచేసినప్పుడు కూడా వారు అదేవిధంగా హర్షం ప్రకటించారు. విశ్వవిద్యాలయం వద్దకు ఉదయం 9-20 గం. లకు మార్షల్ టిటో వచ్చినప్పుడు ఎన్. సి. సి. కేడట్లు, గర్ల్ గైడ్స్ గౌరవ వందనం సమర్పించారు. శ్రీమతి టిటో కూడా తమను అభినందించిన విద్యార్థులకు చేతులు ఊపి ప్రత్యభివందనం చేశారు. సభలో పాల్గొనడానికి పూర్వం మార్షల్ టిటో విశ్వవిద్యాలయ భవనాన్ని తిరిగి చూచారు. విశ్వవిద్యాలయాధ్యక్షుడు శ్రీ ఎస్. సంజీవరెడ్డి, ఉపాధ్యక్షుడు డా. డి. యస్. రెడ్డి వారికి అచ్చట స్వాగతం చెప్పారు.

శ్రీ డి. యస్. రెడ్డి తమ స్వాగత ప్రసంగంలో ఇలా అన్నారు. "సమకాలీన ప్రపంచం తీవ్రమైన ప్రమాదాలలో చిక్కుకున్నప్పటికీ అక్కడ, తమ తమ ప్రజలతో పూర్తి తాదాత్మ్యం సాధించిన యిద్దరు మహాపురుషులు వుండటం సాటిలేని విషయం. వారిలో ఒకరు మా ప్రధానమంత్రి. రెండవ వారు మీరు."



17-1-59 న ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రసంగిస్తున్న మార్షల్ టిటో.



మార్షల్ టిటో (17-1-59 న గోల్కొండ కోటలో).

స్వాగతానికి సమాధానమిస్తూ మార్షల్ టిటో ఇలా అన్నారు. "సహజీవన సిద్ధాంతాల ప్రాతిపదికపై శాంతి, పరస్పర విశ్వాసం, సద్భావం, అంతర్జాతీయ సహకారం కొరకు మన ఉభయ దేశాలు కృషి చేస్తున్నవని అందరికీ తెలిసినదే. ఈ సిద్ధాంతాల ఆధారంగా అన్ని రంగాలలోనూ ప్రయోజనకరంగా మన ఉభయదేశాలు సహకరించుకొన గలవు. ఈ సహకారాన్ని ఇంకా దృఢతరం, విస్తృతం చేయడానికి కూడా ఈ రెండు దేశాలు కృతనిశ్చయములైనవి. సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలలో మన ఉభయదేశాలమధ్య సహకారానికి అత్యంత ప్రాధాన్యత ఇవ్వవలసిన తరుణం ఇది. ఎందుకంటే ఈ సహకారంవల్ల భారత యుగోస్లావియాల సంపన్నమైన సాంస్కృతిక వారసత్వం గురించీ, సమకాలీన ప్రగతిని గురించి ఉభయ దేశాల ప్రజలు పరస్పరం తెలుసుకోవడానికి వీలు పడుతుంది. ఇటువంటి సహకారంవల్ల మన ప్రజల నిర్మాణశక్తి పెంపొందగలదు. అందువల్ల మన ఉభయ దేశాల అభివృద్ధికి, ప్రజలమధ్య సద్భావం పెంపొందడానికి వీలువుంటుంది.

"ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులైన మీ ద్వారా మీ జంటనగరాల యువకులకూ, భారతీయ యువకుల కందరికీ యుగోస్లావియా ప్రజలు, యువకుల శుభాభివందనములను తెలియజేస్తున్నాను. మా ప్రజలు మీయెడల సోదరభావాన్ని కలిగి వున్నారని కూడా నేను చెప్పదలిచాను.

"విద్యాసముపార్జనలోనూ, శిక్షణలోను ఆతరువాత దేశసేవలోను మీకు విజయం కలుగుగాక. ఏదేశపు భవిష్యత్తు అయినా దాని కొత్తతరంపై ఆధారపడి వుంటుందన్న సంగతి మనకు తెలిసిందే. బాధ్యతాయుతమైన, ముఖ్యమైన పదవులలోకి మీరు రావలసి వుంది. స్వతంత్రదేశ పౌరులుగా మీరు అభివృద్ధిచెందుతున్నారని నాకు తెలుసు. విశ్వకళ్యాణానికి అపరిత్యాజ్యమైన శాంతి, అంతర్జాతీయ సహకారముల స్థాపనకు ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన్న మీదేశం అవిరళకృషి చేస్తున్నది. మానవాళి ధ్యేయమైన ఈ ఆదర్శాలను సిద్ధింపజేయడంలో మీరుకూడా మీవంతు ధర్మాన్ని నిర్వర్తిస్తారనడంలో నాకు సందేహమేమీ లేదు. ప్రపంచ యువకులందర మాదిరిగానే మీరు కూడా శాంతి కాముకులేనన్న నమ్మకం నాకు కలిగింది."



మార్షల్ టిటో (కుతుబ్‌షాహీ సమాధులవద్ద).

టిటో దంపతులు 17-1-59న ముఖ్యమంత్రితో కలిసి భోజనం చేశారు. తరువాత ప్రత్యేక విమానంలో మద్రాసుకు బయలుదేరారు.



మార్షల్ టిటో హైదరాబాదు సందర్శనకు సంబంధించిన ఛాయా చిత్రాలుగల ఆల్బమ్ విమానాశ్రయంలో ఆయనకు రాష్ట్ర ముఖ్యమంత్రిచే బహూకరింపబడింది.



మార్షల్ టిటో ప్రభృతులు (18-1-59 న ఆయన హైదరాబాదునుండి బయలుదేరేముందు విమానాశ్రయంలో)

# వేతన నిర్ణాయక సంఘం సిఫార్సులు

తక్కువ జీతాలు గల ప్రభుత్వోద్యోగుల సర్వీసు పరిస్థితులను, జీతపు స్కేళ్ళను గురించి విచారణ జరిపించాలనే సమస్య కొంత కాలంగా ప్రభుత్వ పరిశీలనలో వుంది. దీనిని గురించి ప్రభుత్వానికి పదే పదే విజ్ఞప్తులు కూడా వచ్చాయి. దాని మీద గత సంవత్సరం మే నెలలో ప్రభుత్వోద్యోగుల జీవన పరిస్థితులను వివరంగా పరిశీలించి, వారి యిబ్బందులను తీర్చటానికి అవసరమైన సిఫార్సులను చేయుటకై ప్రభుత్వం ఒక వేతన నిర్ణాయక సంఘాన్ని నియమించింది.

దీనికి ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి గారు అధ్యక్షులు. ప్లానింగ్ అభివృద్ధి సమాచార శాఖామాత్యులు శ్రీ వి. బి. రాజు గారు, శాసన సభ్యులు శ్రీ పి. సుందరయ్య, శ్రీ ఎ. వి. భానోజీరావు గార్లు, ప్రభుత్వ ఆరోగ్య, స్థానిక పరిపాలనశాఖ కార్యదర్శి శ్రీ యల్. యస్. గుప్త గారు సభ్యులు, ప్రభుత్వ ఆర్థిక శాఖ అసిస్టెంటు కార్యదర్శి శ్రీ ఎ. యల్. కాంతారావుగారు యీ సంఘానికి కార్యదర్శిగా వ్యవహరించారు.

## 4 వ తరగతిఉద్యోగులు

వేతనాల సంఘం వారు చేసిన ముఖ్యమైన సిఫార్సు ప్రకారం, 4వ తరగతి ఉద్యోగుల మొత్తం జీతము కనీస పరిమితి రు. 56లుగా నిర్ణయించబడింది; రు 26 ప్రాతిపదిక వేతనం రు 30 లు కరువు భత్యము. లోయల్ డివిజన్ గుమాస్తాకు ప్రాతి పదిక వేతనం రు. 50లు, కరువు భత్యం రు. 34; మొత్తం 84 లు, స్కేలు 50-3-92-4-120. ప్రస్తుతం 90-175 ఆంధ్ర స్కేలులో గానీ లేక 135-200 తెలంగాణా స్కేలులోగానీ సచికాలయంలోని శాఖలలోనూ, శాసనసభ కార్యాలయంలోను వున్న అప్పర్ డివిజన్ గుమాస్తాకు 100-5-140-7 1/2-200 స్కేలును సంఘంవారు సిఫార్సు చేశారు. సబార్డినేట్ కార్యాలయాలలోనూ, జిల్లాలలోనూ ఉన్నవారికి 90-4-110-5-150-7 1/2-180 స్కేలు సిఫార్సు చేయబడింది.

ఆంధ్రగ్రేడ్ 80-125,లో గానీ లేక తెలంగాణా గ్రేడ్ 105-170లో గానీ ప్రస్తుతం ఉన్న వారికి 90-180 గ్రేడ్ లభిస్తుంది. ఆంధ్రగ్రేడ్ 80-110లో వున్న వారికి 90- 150 వర్తిస్తుంది. అయితే సబార్డినేట్ ఆఫీసుల్లోనూ, జిల్లా కార్యాలయాల్లోనూ ప్రస్తుతం తెలంగాణా గ్రేడ్ 105-170 లో వున్న పదవులకు 90-150 స్కేలు మాత్రమే లభిస్తుంది. 90-180స్కేలు వాటికి వర్తించదు.

## సూపరింటెండెంట్లు

గవర్నరు సిబ్బందిలోనూ, సచివాలయంలోనూ, యితర కార్యాలయాల్లోను, ఆంధ్రస్కేలు 200-400లో గానీ, తెలంగాణా స్కేలు 200-350లో గానీ వున్న సూపరింటెండెంట్లకు 200-10-310-15-400 స్కేలు లభిస్తుంది. డైరెక్టరేట్ కార్యాలయంలో 190-240 స్కేలులోగానీ, అంతకుపెద్ద స్కేలులోగానీ, తెలంగాణా స్కేలు 170-320లో గానీ ఉన్న పదవులకు క్రొత్త స్కేలు 150-7-1/2-210-10-300 లభిస్తుంది. 140-190 స్కేలులోని పదవులకు 150-7-1/2-210-10-250 స్కేలు వర్తిస్తుంది. మంత్రుల పర్సనల్ అసిస్టెంట్సులో 100-200-400 గ్రేడ్‌లో లేనివారికి, వారు సచివాలయంలో ఏ శాఖలనుండి వచ్చినారో అక్కడి అప్పర్ డివిజన్, లేక సూపరింటెండెంట్ పదవులకు వుండే స్కేలు వర్తింపజేసి, అదనంగా రు. 40 ల ప్రత్యేక వేతనం యివ్వాలని సంఘం సిపార్సుచేసింది. వారి పని కొంత కష్టమైనది కనుక ప్రత్యేక వేతనం ఏర్పాటు చేయబడింది.

అప్పర్ డివిజన్, రెండోగ్రేడ్, లోయర్ డివిజన్, మూడవగ్రేడ్ అంటూ యిప్పుడున్న పేర్లకు బదు

లుగా మినిస్టీరియల్ సిబ్బంది యావత్తు యికమీద "సీనియర్ అసిస్టెంట్లు", "జూనియర్ అసిస్టెంట్లు"గా వ్యవహరించబడాలనీ, అదేవిధంగా మొదటి గ్రేడ్ గుమాస్తాలను ఆంధ్రప్రాంతంలోవలె సూపరింటెం డెంట్లుగా వ్యవహరించాలనీ సంఘం సిఫార్సుచేసింది,

## టైపిస్టులు, స్టెనోలు

ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతపు టైపిస్టులకు, స్టెనోలకు లోయర్ డివిజన్ గుమాస్తా స్కేలుతోపాటు టైప్ రైటింగ్‌కు రు 10 లు ప్రత్యేక వేతనము, షార్ట్‌హాండ్‌కు రు. 35 లు ప్రత్యేక వేతనము యిస్తున్నారు, టైపిస్టును ఉద్యోగంలో చేర్చుకోటానికి అవసరమైన కనీస విద్యాయోగ్యత యస్. యస్. యల్. సి, లోయర్, లేక హైయర్ టైప్ రైటింగ్ పరీక్షలో వుత్తీర్ణత కాబట్టి టైపిస్టుకు లోయర్ డివిజన్ గుమాస్తా స్కేలు వర్తింపజేయవచ్చునని సంఘంవారు భావించారు. మామూలుగా యస్. యస్. యల్. సి. లో ఉత్తీర్ణులైన అభ్యర్థుల కంటే, టైపిస్టులకు ప్రభుత్వోద్యోగంలో చేరే అవకాశాలు ఎక్కువ కనుకనూ, లోయర్ డివిజన్ గుమాస్తాలకే యీ సంఘంవారు చాలా మంచి స్కేలు సూచించియున్నందుననూ, టైపిస్టులకు ప్రత్యేక వేతనాన్ని సంఘంవారు సూచించలేదు. ప్రస్తుతం ఉద్యోగంలోవుండి రు. 10 ల టైప్ రైటింగ్ అలవెన్సు పొందుతున్నవారి విషయంలో దానిని వారి వ్యక్తిగత వేతనంక్రింద పరిగణించి క్రొత్త స్కేలులో వారి జీతము నిర్ణయించునపుడు దానిని కలిపివేయుట జరుగుతుంది.

స్టెనోల విషయం. ఈ పదవుల ప్రత్యేక స్వభావాన్ని బట్టి పని కష్టమైన పరిస్థితిని బట్టి వీరిని అప్పర్ డివిజన్‌లో గానీ లోయర్ డివిజన్‌లో గానీ నియమించుకోవచ్చునని సంఘం అభిప్రాయ పడింది. లోయర్ షార్టుహాండ్ పరీక్ష ప్యాసైన స్టెనోలుగా నియమితులైన వారికి నెలకు రు 15 లు షార్టు హాండ్ ప్రత్యేక వేతనంయిస్తారు. షార్టుహాండ్ హైయర్ గ్రేడ్ ప్యాసై నియమించ బడినవారికి నెలకు రు 25ల ప్రత్యేకత వేతనం యిస్తారు.

## అసిస్టెంట్ శెక్రెటరీలు

ప్రస్తుతం అసిస్టెంట్ శెక్రెటరీలు ఆంధ్రగ్రేడ్ 475-700 లలోగానీ, తెలంగాణా గ్రేడ్ 400-700 లలో గాని వున్నారు. అందరికీ సమానమైన గ్రేడ్ నిర్ణయించుటకై సచివాలయంలోని అసిస్టెంట్ శెక్రటరీలకూ, శాసనసభా కార్యాలయంలోని అసిస్టెంట్ శెక్రెటరీలకూ 400-25-700 గ్రేడ్‌ను సంఘంవారు సిఫార్సు చేశారు.

## ఇంక్రిమెంట్లు

ప్రస్తుతం కొన్ని సందర్భాలలో రెండేండ్ల కొకసారి యింక్రిమెంటు వచ్చే పద్ధతికి బదులుగా సాలుసరి యింక్రిమెంట్ల పద్ధతినే సంఘంవారు సిఫార్సు చేశారు. ప్రతియేడూ యింక్రిమెంటు రావడంవల్ల ఉద్యోగులలో ఉత్సాహం పెంపొందుతుందనీ, ప్రతియేడూ జీతం పెరుగుతుందనే సంతృప్తి, ఆశకలుగుతుందనీ వారు భావించారు. ప్రస్తుతపు యింక్రిమెంటు రేట్లు తక్కువగా వున్నాయి. సంఘంవారు సిఫార్సుచేసిన క్రొత్త స్కేళ్లలో యింక్రిమెంట్లు చాలాభాగం, దాదాపు అన్ని సందర్భాలలోనూ ఎక్కువగానే వున్నాయి.

## కరువుభత్యం

కరువుభత్యం యికమీదట, యితర రాష్ట్రాలలో వలె క్రమంగా ఎక్కువయ్యే 'శ్లాబ్' పద్ధతిలో వుండాలని సంఘంవారు సిఫార్సు చేశారు. కరువుభత్యం రేట్లను నిర్ణయించటంలో, ప్రభుత్వం 1-4-1957 తేదీన మంజూరుచేసిన తాత్కాలిక హెచ్చింపు రు. 6లు, 1-1-1958 నుండి జంటనగరాలలో రు 200ల వరకు జీతంవచ్చే వారికి ప్రభుత్వం మంజూరుచేసిన నగరభత్యం రు 6లు, నెలకు 90లకు మించని ప్రాథమికోపాధ్యాయులకు, నెలకు రు 175లకు మించని సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయులకు 1958 జూలై నుండి యిచ్చిన రు 5ల తాత్కాలిక హెచ్చింపు-యివన్నీ సంఘంవారు లెక్కలోనికి తీసుకున్నారు. యికముందు యీ అలవెన్సులన్నీ ప్రత్యేకంగా చెల్లిస్తూవుండడం జరుగదు. ప్రస్తుతం యిస్తున్న యింటిఅద్దె అలవెన్సు కూడా కరువు

భత్యంలో కలిపివేశారు కాబట్టి, యికముందు అ అలవెన్సు వుండదు.

## క్రొత్త కరువుభత్యం వివరాలు

| జీతం | కరువుభత్యం |
|---|---|
| రు. 43 వరకు | రు. 30 |
| రు. 44 నుండి రు. 59 వరకు | రు. 34 |
| 60 — 149 | 35 |
| 150 — 179 | 40 |
| 180 — 209 | 43 |
| 210 — 249 | 48 |
| 240 — 269 | 53 |
| 270 — 299 | 58 |
| 300 — 349 | 60 |
| 350 — 399 | 65 |
| 400 — 499 | 70 |
| 500 — 1000 | 75 |

—రు. 1075ల వరకు సర్దుబాటు జరుగుతుంది

## క్రొత్త స్కేళ్లలోనికి మార్పు :

యిప్పటి ఉద్యోగుల జీతాలను కొత్త స్కేళ్లలోనికి మార్చి నిర్ణయించే సందర్భంగా దిగువ పేర్కొన్న విధానాన్ని అనుసరించాలని సంఘం సిఫార్సుచేసింది.

1 యిప్పుడు యిస్తున్న కరువుభత్యము, 1-4-1957 నుండి నెలకు రు. 6ల వంతున మంజూరుచేసిన తాత్కాలిక హెచ్చింపు మొత్తము, రు. 6ల నగరభత్యము, 1958 జూలైనుండి ఉపాధ్యాయులకు యిచ్చిన రు. 5లు, ప్రభుత్వపు యిండ్లు యిచ్చినవారు కాక మిగిలిన వారికి యిప్పుడిచ్చే యింటి అద్దె అలవెన్సు యివన్నీ కలుపగా వచ్చే మొత్తము, క్రొత్తగా నిర్ణయించిన కరువుభత్యపు మొత్తముకంటే ఎక్కువైన యెడల, ఆభేదము ఉద్యోగి యిప్పటి స్కేలులోని ప్రాతిపదిక వేతనములో కలుపుతారు. తరువాత దానిని కొత్త స్కేలులో తరువాత వుండే దశ (stage)లో నిర్ణయిస్తారు. ఆవిధంగా వచ్చిన మొత్తము కొత్త స్కేలులో ఒక నిర్ణీతదశగా వున్నా, లేకున్నా, తరువాత దశలోనే నిర్ణయిస్తారు.

2 ఉద్యోగి ప్రస్తుత జీతము లేదా పైన 1వ పేరాలోవలె భేదము కలుపగా వచ్చిన జీతము కొత్త స్కేలులోని ప్రాతిపదిక వేతనముకంటే తక్కువగా ఉంటే, కొత్త స్కేలులోని కనీస వేతనమే ఆఉద్యోగికి లభిస్తుంది.

3 ప్రస్తుతం రు. 10ల టైపిస్టు అలవెన్సు పొందుతున్న టైపిస్టుల యిప్పటి స్కేలులో అలవెన్సు కలుపబడి, తరువాత వారి జీతము కొత్తస్కేలులో పైన పేర్కొన్న విధంగా నిర్ణయించబడుతుంది.

4 ఉద్యోగికి జీతం ఆవిధంగా నిర్ణయించబడిన తరువాత, ప్రస్తుత గ్రేడ్‌లో పూర్తిఅయిన 5 సంవత్సరముల సర్వీసుకు ఒక ఇంక్రిమెంటు, 10 సంవత్సరాలకు అంతకుమించిన కాలానికి 2 యింక్రిమెంట్లు, దానికి చేర్చవలెను. యి క్రిమెంటు రేటు రు. 15లు అంతకుమించి వున్న అధికారి విషయంలో, క్రొత్తగ్రేడ్‌లో జీతము నిర్ణయించునపుడు, ప్రస్తుతగ్రేడ్‌లో 5 సంవత్సరముల సర్వీసు పూర్తిఅయిన యెడల ఒక ఇంక్రిమెంటు మాత్రమే కలుపబడును.

5 సబ్‌స్టాన్టివ్, ఆఫీషియేటింగ్ పదవులలో పని చేస్తున్న వారి జీతముల నిర్ణయవిషయములో యీ సూత్రములు వర్తించును.

6 నిర్ణీతమొత్తము జీతముగల పదవులకు కొత్త స్కేళ్ళు ప్రతిపాదించిన సందర్భాలలో, నిర్ణీత జీతముపై చేసిన సర్వీసు ఒక స్కేలులో చేసిన సర్వీసుగానే పరిగణింపబడగలదు.

7 పైవిధముగా వైటేజి లెక్కించి కలిపినపుడు జీతము మొత్తము, కొత్తస్కేలు గరిష్ట పరిమాణము దాటినపుడు, గరిష్ట పరిమాణమువద్ద జీతము నిర్ణయించవలెను.

8 కొత్తస్కేళ్లలో యింక్రిమెంటుకు నిర్ణయించిన కాలపరిమితి అనంతరమే యింక్రిమెంటు వస్తుంది.

కాని యిప్పటి స్కేలులో చేసిన సర్వీసు క్రొత్త స్కేలులో యింక్రిమెంటు యిచ్చుటకు పనికి రాదు.

9 యిప్పటి స్కేళ్లలోనే వుండదలచినవారికి వైటేజి రాదు.

10 క్రొత్తస్కేలు, పాతస్కేలుల కనీస, గరిష్ట పరిమాణాలు సమముగానున్న సందర్భాలలో, యింక్రిమెంట్లు మాత్రం తేడాగా వున్న యెడల జీతము క్రొత్తస్కేళ్ళలో నిర్ణయించునపుడు, సంఘంవారు సూచించిన గ్రేడు, క్రొత్తగ్రేడుగా పరిగణించబడును.

యిప్పటి స్కేలులో వుండటానికిగానీ, క్రొత్త స్కేలు కోరుకోటానికిగానీ, సబ్‌స్టాన్టివ్, లేక అఫీషియేటింగ్ పదవులలోనున్న వారందరికీ స్వేచ్ఛ యివ్వాలని సంఘంవారు భావించారు. ఒకసారి కోరుకుంటే అదే ఖాయం. పాతస్కేళ్ళలో వుండదలచిన వారికి యిప్పటివలెనే కరువుభత్యం, యింటిఅద్దె అలవెన్సులు యిస్తారు. సంఘంవారు సూచించిన క్రొత్తస్కేళ్లు 1-11-58 నుండి అంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ద్వితీయ వార్షికోత్సవము నాటినుండి అమల్లోకి రాగలవు.



# ఖమ్మం మెట్టు

ఖమ్మం, మధిర, యెల్లందు, పాల్వంచ, బూర్గంపాడు తాలూకాలతో కూడుకున్న ప్రస్తుతపు ఖమ్మం జిల్లా, పూర్వం వరంగల్లు జిల్లాలో భాగంగా వుండేది. పై అయిదు తాలూకాల అజమాయిషీ కొరకు 1950 అక్టోబరు 1 వ తేదీన అదనపు కలెక్టరు నియమించబడినాడు. 1953 నవంబరు 1 న ఖమ్మం ప్రత్యేక జిల్లాగా ఏర్పడింది. దానికి అప్పటి హైద్రాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఖమ్మం పట్టణానికి 950 సంవత్సరాల చరిత్ర వుంది. పూర్వం ఇది "దాయాదుల అమ్మపాలెం" అని పిలువబడేది. ఈ పట్టణానికి తూర్పుదిశన ఒక కొండపైన శ్రీ నృసింహస్వామి దేవాలయంవుంది. ఖమ్మంమెట్టు అన్న ప్రస్తుతపుపేరు స్థంభాద్రి లేక స్థంభగిరి అను దీని అసలు పేరుకు రూపాంతరమైనట్టు కనిపిస్తుంది. ఖమ్మం పట్టణం, క్రీ. శ. 1299 వ సంవత్సరానికి పూర్వమే జిల్లా ముఖ్యపట్టణంగా వుండింది. కాని తరువాత వరంగలు జిల్లాలో తాలూకాగా ఏర్పడింది. క్రీ. శ. 591 వ సంవత్సరానికి పూర్వం ఇది ఓరుగల్లు సామ్రాజ్యంలోనిది. రంగారెడ్డి, లఖ్నారెడ్డి, వేమారెడ్డి అను ముగ్గురు సోదరులు, ఓరుగల్లు నుంచి కొంత నిక్షేప ధనంతో ఇచ్చటికి వచ్చి ప్రస్తుతపు కోటనూ, లఖ్నావరం చెరువు అను ఒక తటాకాన్ని నిర్మించినట్టు ఒక కథ వాడుకలోవుంది. 1768 వ సంవత్సరంలో జాఫరుద్దౌలా ఈ కోటపై ఒక మసీదును, ఒక బావిని కట్టించాడు.

ఖమ్మం సముద్రమట్టానికి 315 అ. ఎత్తున, 17.14.38 అక్షాంశములు, 80.9.4 రేఖాంశముల మధ్యన వుంది. దీనికి ఉత్తరాన వరంగలు ; దక్షిణాన కృష్ణా ; పడమరన నల్గొండ, తూర్పున తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు సరిహద్దులుగా వున్నవి. ఈ జిల్లా జనాభా 6,96,074. విస్తీర్ణం 4,299 చదరపుమైళ్లు. గ్రామాల సంఖ్య 674. మొత్తం జనాభాలో పురుషులు 359,089 మంది. మిగిలినవారు స్త్రీలు. జనాభాలో నూటికి 17.2 వంతుల మంది పట్టణాల్లో నివశిస్తున్నారు. జనాభాలో నూటికి 71.7 వంతులు అనగా 501,792 మంది జీవనం వ్యవసాయంపై ఆధారపడివుంది.

ఈ జిల్లా ఆంధ్రప్రదేశ్‌లోని మిక్కిలి ఉష్ణమైన ప్రదేశాలలో ఒకటి. వేసవి కాలంలో ఈ ప్రాంతం ఉష్ణోగ్రత 120 డిగ్రీలవరకు కూడా పెరుగుతూ వుంటుంది. సగటు వర్షపాతం 39 అంగుళాలు.

**ఈ జిల్లా భౌగోళిక విస్తీర్ణం**
2778961 ఎకరాలు 100 శాతం

అడవులచే కప్పబడివున్న భూభాగం విస్తీర్ణం
1188683 ఎకరాలు 42.77 శాతం

సేద్యయోగ్యంకాని బంజరుభూమి
184729 ఎకరాలు 6.65 శాతం

సేద్యయోగ్యమైనదైనప్పటికీ సేద్యం చేయబడని
భూమి 101372 ఎకరాలు 3.65 శాతం

బీళ్లు 83852 ఎకరాలు 3.02 శాతం

విత్తనాలు వేయబడు భూమి నికర విస్తీర్ణం
864066 ఎకరాలు 31.09 శాతం

మొత్తం పంటభూమి విస్తీర్ణం
866053 ఎకరాలు 31.24 శాతం.

మొత్తం పల్లపుభూమి విస్తీర్ణం 100574 ఎకరాలు

జిల్లాలో ఇసుకనేలలు అధికంగా ఉన్నవి. ఖమ్మం తాలూకా మొత్తంలో నేల ఒంపుదింపులుగా వుంటుంది. సారవంతమైన చదునైన భూములుకూడా కొన్ని ఇచ్చట వున్నవి. పాల్వంచ తాలూకాలో



శ్రీ జె. కొండలరావు, శా. స. స.

ఇసుకభూమి ఎక్కువైనప్పటికీ గోదావరి తీరాన వున్న భూములు డెల్టా భూములను పోలివున్నాయి. యెల్లందు తాలూకా భూములుకూడా ఈ విధంగానే వున్నవి. రేగడి నేలలు చెదరువాటుగా వున్నవి

వరి, పచ్చజొన్న, పెసర, వేరుశనగ, పొగాకు ఈ జిల్లా ముఖ్యపంటలు.

వైరా, పాలేరు, బైతుపల్లి, సింగభూపాలెం ప్రాజెక్టులు ఈ జిల్లాలోని ప్రధాన నీటి పారుదల ప్రాజెక్టులు.

పాలేరు ప్రాజెక్టు: ఇది ఖమ్మం తాలూకాలో పాలేరు సమీపంలో వుంది. దీని ఆరగాణి (కాచ్మెంట్) విస్తీర్ణం 651 చ.మైళ్లు. ఇది 1337 వ ఫసలీ నుంచి నీటి పారుదలకు ఉపయోగపడుతున్నది. ఆయకట్టు 17,900 ఎకరాలు. నీటి తీరువకింద సుమారు రూ. 2,07,472/- లు వస్తుంది.

వైరా ప్రాజెక్టు: ఇది మధిర తాలూకా వైరా వద్ద, ఖమ్మంమెట్టుకు 16 మైళ్ల దూరంలో వుంది. 1935 వ సం. నుంచి ఇది నీటి పారుదలకు ఉపయోగపడుతున్నది. ఆయకట్టు 19,0000 ఎకరాలు.

బైతుపల్లి ప్రాజెక్టు: ఇది మధిర తాలూకాలో 'తమ్మిలేరు'పై రూ. 227,300/-ల వ్యయంతో నిర్మించబడింది. దీని ఆరగాణి విస్తీర్ణం 102 చ.మైళ్లు. పి. డబ్ల్యు. డి. స్థిరీకరించినదాన్నిబట్టి దీని ఆయకట్టు 4,800 ఎకరాలు.

సింగభూపాలెం ప్రాజెక్టు: ఇది యెల్లందు తాలూకాలో సింగభూపాలెంవద్ద వుంది. 1955-56 లో 1700 ఎకరాలు దీని పారుదల క్రిందికి తేబడినవి. అందువల్ల రూ. 14,513/- లు భూమి శిస్తుక్రింద వసూలైంది. ఈ జిల్లాలో 1568 నీటి వనరులక్రింద 64,974 ఎకరాల ఆయకట్టు వుంది. ఇంతేగాక వివిధ ప్రాజెక్టుల క్రింద 35,600 ఎకరాలు సాగు చేయబడుతున్నవి.

రాకపోకలు: ఈ జిల్లాలో రోడ్ల నిడివి సుమారు 320 మైళ్లు. యెల్లందు మినహా మిగిలిన అన్ని తాలూకా ముఖ్య పట్టణాలనుంచీ జిల్లా ముఖ్య పట్టణానికి నేరుగా రోడ్డు మార్గాలు ఉన్నవి. ఖమ్మం-యెల్లందు రోడ్డు నిర్మాణం ప్రణాళికా పథకాలక్రింద జరుగుతున్నది. ఇందుకొరకు రూ. 16,00,000/-లు మంజూరు చేయబడినవి. రూ. 37.10 లక్షల వ్యయంతో బూర్గుంపాడునుంచి నాగారం వరకు రోడ్డు నిర్మించే పథకం కూడా మంజూరైంది. బూర్గుంపాడు వద్ద గోదావరికి అడ్డంగా రూ. 7,00,000/-ల వ్యయంతో ఎత్తైన వంతెనను నిర్మించే పని చేపట్టబడింది.

పరిశ్రమలు: బొగ్గు ఈ జిల్లాలో ప్రధానంగా లభించేఖనిజం. ఇండియా జియొలాజికల్ సర్వేకి చెందిన



శ్రీ శీలం సిద్ధారెడ్డి, శా. మం. స. (ఖమ్మం).

డా. కింగ్, 1871 లో యెల్లందు సమీపంలో బొగ్గు ఉన్నదని కనుగొన్నాడు. బొగ్గును త్రివ్వి తీసే హక్కును హైదరాబాదు (దక్కన్) కంపెనీ లిమిటెడ్ 1886లో పొందింది. బొగ్గు వాడకం పెరిగి దాని ఉత్పత్తి హెచ్చడంతో 1921 లో సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ స్థాపించబడింది. 1945లో హైదరాబాదు ప్రభుత్వం హైదరాబాదు (దక్కన్) కంపెనీ లిమిటెడ్‌కు గల వాటాలను కొన్నది. ప్రస్తుతం కంపెనీ వాటాలలో 87 శాతం వాటాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి వున్నవి. కంపెనీ ఆస్తులు రూ. 472.97 కోట్లు విలువ చేస్తాయి కొత్తగూడెం, యెల్లందు బొగ్గుగనుల్లో త్రవ్వకంపని జరుగుతుంది. 19౦5 లో 998316 టన్నుల బొగ్గు త్రివ్వి తీయబడింది. ముడి ఇనుము 80678 టన్నులు, గ్రాఫైటు 100, క్రోమైటు 70 టన్నులు,ఇసుక 13695 టన్నులు లభించాయి.

సహకార సంఘాలు : జిల్లాలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో 6 పెద్ద రకం సహకార సంఘాలు స్థాపించబడినవి. ఖమ్మంలో ఒక మార్కెటింగ్ సంఘం, పినపాకలో ఒక సహకార వ్యవసాయ సంఘం కూడా నెలకొల్పబడినవి. మొత్త. 372 సంఘాలు రూ. 29,70,000 ల ధనంతో నడుపబడుతున్నవి. వీటిలో 26,600 మంది సభ్యులుగా వున్నారు. ఈ జిల్లాలో 78 శాతం గ్రామాలు, 17.03 శాతం కుటుంబాలు సహకార పరిధిలోకి తేబడినవి.

వైద్య సదుపాయాలు : ఖమ్మం తాలూకా ఆసుపత్రి, జిల్లా ఆసుపత్రిగా మార్చబడింది. ప్రస్తుతం జిల్లా ఆరోగ్యాధికారికూడా నియమించబడినాడు. ఒక వైద్యాధికారి అధ్వర్యాన అంబులెన్స్, బెడ్ ఫోర్డ్ ట్రక్‌లు గల ఒక సంచార వైద్య యూనిట్ మారుమూల గ్రామాలకుకూడా వెళ్ళి వైద్య సదుపాయాలు కల్పిస్తున్నది.

విద్య : 1957 వ సంవత్సరాంతానికి ఈ జిల్లాలో గల విద్యాసంస్థల వివరాలు ఇవి :

| | |
|---|---|
| ఆర్ట్స్, సైన్స్ కళాశాల | 1 |
| ప్రభుత్వోన్నత పాఠశాలలు | 6 |
| ప్రభుత్వ సహాయం పొందుతున్న ఉన్నత పాఠశాలలు | 16 |
| ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలు | 28 |
| ప్రభుత్వ సహాయం పొందుతున్న మాధ్యమిక పాఠశాలలు | 16 |
| ప్రాథమిక పాఠశాలలు | 573 |
| బహుళార్థసాధక ఉన్నత పాఠశాల | 1 |
| సెకండరీగ్రేడు బేసిక్ శిక్షణ పాఠశాలలు | 2 |
| జూనియర్ బేసిక్ పాఠశాలలు | 41 |
| సీనియర్ బేసిక్ పాఠశాలలు | 2 |
| మొత్తం | 689 |

## భూసంస్కరణలు

1950 హైదరాబాదు కౌలు దారీ, వ్యవసాయ భూముల చట్టం యొక్క కొన్ని ముఖ్య విభాగాల అమలు కొరకు పూర్వ హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వం, ఈ జిల్లాలో ప్రథమ పర్యాయంగా ఒక ప్రతేక పథకాన్ని అమలు పరిచింది. 1955 నవంబరు 1 న జరిగిన భూసంస్కరణల దినోత్సవంలో 24429 మంది భూమి యజమాన్యపు హక్కుగల రక్షిత కౌలు దార్లుగా ప్రకటించ బడినారు. వారిలో 11,426 మందికి 87,269 ఎకరాల మీద యాజమాన్యం లభించింది. ఎకరానికి సగటున రూ 35/- ల చొప్పున మొత్తం రూ.3183069ల నష్ట పరిహారం నిర్ణయించ బడింది

కౌలుదారీ చట్టం యొక్క వివిధ విభాగాల ననుసరించి 1002 అపీళ్లు చేయబడినవి. వీటిలో 929 కేసులు 1957 సంవత్సరాంతానికి పరిష్కరింపబడినవి.

రైల్వేలు : కేంద్ర రైల్వే కాజీపేట-బెజవాడ రైలుమార్గం ఈ జిల్లాగుండా ఉత్తరం నుంచి దక్షిణానికి వుంది. డోర్నకల్ నుంచి యెల్లందుకు భద్రాచలం లోడ్‌కు రెండు బ్రాంచిలైన్లు ఉన్నవి. మొదటిది 17 మైళ్ళ నిడినిగల మార్గం. రెండవది 34 మైళ్ళది.

MAP OF KHAMMAM DISTRICT

Scale - 16 Miles = 1

REFERENCE
RAILWAY LINE
ROAD
RIVER
CANAL
PROJECT

GODAVARI RIVER
BHADRACHALAM
KHAMMAMET
YELLANDU
PALONCHA
MADHIRA
SINGABHUPALEM PROJECT
PROPOSED EDULAVAGU PROJECT
PROPOSED BETHAMPUDI PROJECT
LARGE TANK BYYARAM
NAGARJUNSAGAR CANAL
BALANCING RESERVOIR ON MUNER RIVER
PALAIR PROJECT
WYRA PROJECT
BOITH PALLY PROJECT

స్థానిక పరిపాలన : ఖమ్మం, యెల్లందు, గార్ల, మధిరలు ఈ జిల్లాలోని నాలుగు మునిసిపల్ పట్టణాలు. గ్రామ పంచాయతీలు 85 ఉన్నవి.

జాతరాలు : దిగువ ప్రదేశాల్లో ప్రతి ఏటా జాతరాలు జరుగు తుంటాయి ;

1. కూడిల్లి
2. లక్ష్మీపురం
3. నేలకొండపల్లి
4. నాగులవంచ
5. ఖమ్మంమెట్టు (నృసింహస్వామి కళ్యాణ అరునాళ్ళ)

అభివృద్ధి ; ప్రస్తుతం జిల్లాలో 6 సమాజాభివృద్ధి కేంద్రాలు వున్నవి. వీటిలో అశ్వారావు పేటని ఏజన్సీ కేంద్రంగా పరిగణింప బడుతుంది. ఇప్పటి వరకు సమాచాభివృద్ధి కార్యక్రమాలను 430 గ్రామంలకు విస్తరింప జేయట మైనది. 1669. 57 చ. మైళ్ళలో వ్యాపించియున్న ఈ గ్రామాల జనాభా 36,73,28.

స్థానికాభివృద్ధి పథకం క్రింద 63 పాఠశాల భవనాల మంజూరైనవి. వీటిలో 50 భవనాల నిర్మాణం పూర్తయింది. 23 రోడ్డునిర్మాణ పథకాలు చేపట్ట బడినవి. 35 బావులు త్రవ్వబడినవి.

బోనకల్లులో రూ. 1,20,000 వ్యయంతో కార్మికుల కాలనీ ఒకటి నిర్మి ప బడింది. పాలడుగులో కూడా గ్రామీణ గ్రహనిర్మాణ కాలనీ నిర్మింప బడింది.

తక్కువ ఆదాయం గల వారి గ్రహ నిర్మాణ పథకం క్రింద ఖమ్మంమెట్టులో 5 మూడు గదుల ఇండ్లు, 35 రెండు గదుల ఇండ్లు, 10 ఒకగది ఇండ్లు రూ. 23,000 ల వ్యయంతో నిర్మింపబడినవి.

పారిశ్రామిక కార్మికుల గ్రహ నిర్మాణ పథకం కూడా ఖమ్మంమెట్టులో అమలు జరుగు తున్నది. దీన్ననుసరించి రూ. 5,00,000 ల వ్యయంతో 200 ఇండ్లు నిర్మించబడతాయి.

ప్రదర్శికా పథకాల క్రింద, 1857-58 లో బూర్గుంపాడులో రూ. 0.32 లక్షల వ్యయంతో వర్జీనియా పరిశోధనా కేంద్రం స్థాపింపబడింది.



# మహబూబునగర్ జిల్లాలో చెంచు ప్రజలు

మహబూబ్‌నగర్ జిల్లాలో అమరాబాద్ పీఠ భూమి యని వ్యవహరించబడుతున్న ప్రాంతంలో గిరిజనులు నివసిస్తున్నారు. యిది కొండప్రాంతం. కృష్ణానదికి ఉత్తరదిశగా వుంది. యిక్కడ నివసించే గిరిజనులు చెంచుజాతికి చెందినవారు. 1951 జనాభా లెక్కల ననుసరించి యీ జిల్లాలో వీరిసంఖ్య 4,727.

అమరాబాద్ పీఠభూమి రెండు భాగాలుగా వుంది. దిగువభాగంలో సాగవుతున్న వ్యవసాయ భూములు చాలా వున్నాయి. యిక్కడ గ్రామాల సంఖ్య ఎక్కువ. జనాభాకూడా బాగానేవుంది. మామూలు మైదాన ప్రాంతంలోవున్న గ్రామాల లాగే యివికూడా వుంటాయి. అక్కడక్కడ మాత్రం చెంచుల గూడెములు వుంటాయి. ఎగువ భాగం పూర్తిగా అటవీప్రాంతం. యిక్కడ జనాభా అందరూ చెంచులే. ఈ ప్రాంతంలోని అడవుల్లో నివశించే చెంచులు దాదాపు మైదాన ప్రాంతాల సరిహద్దుల వరకు వలసవచ్చి, వ్యవసాయ కూలీలు గానో, లేక చిన్న రైతులుగానో పనులు చేసుకుంటున్నారు. ఈవిధంగా రావటం కొనసాగుతూనే వుంది.

## గిరిజన ప్రాంతం రెండు విభాగాలు

చెంచుప్రజలు నివశించే ప్రాంతమంతా, వారి జాతి విభాగాల ననుసరించి నిర్దిష్టంగా విభజింపబడి వుంది. ప్రతిప్రాంతంలో ఒక పర్మినెంటు సెటిల్మెంటు ఏర్పాటు చేయబడింది. ఈ సెటిల్మెంటు పేరుతోనే దాని లోని గిరిజనులు వ్యవహరించబడుతారు. వర్షాకాలం లోనూ చలికాలంలోనూ గ్రామంలో ప్రజలుంటారు. కాని జనవరినెల రాగానే అందరూగానీ, లేక కొన్ని కుటుంబాలవారు గాని గ్రామం వదలివెళ్లి, 3, 4 నెలలవరకు చిన్నచిన్న టెంపరరీ సెటిల్మెంట్లలో మకాం వేస్తారు. వీటిలో చాలాభాగం దిగువ ప్రాంతాలలో కృష్ణాతీరంలో వున్నాయి. మిగిలినవి అడవులలో త్రాగటానికి నీరు, తినటానికి తిండి దొరికే చోట్లలో వున్నాయి. మార్చినెల చివరిభాగం మోదుగపూలు పుష్కలంగా లభించేకాలం. యివి ఆహారంగానూ, సారాలోనికి పనికివస్తాయి. ఆ రోజుల్లో చెంచులు మోదుగుచెట్లు ఎక్కువగావుండే ప్రాంతాలను వెతుక్కుంటూ లోయప్రాంతాలనుండి పీఠభూమి వైపుకు వెళ్తారు. వెళ్ళితే తమ స్వగ్రామానికైనా వెళ్తారు. లేకుంటే కొండలమీద వుండే తాత్కాలిక నివాసాలకైనా వెళ్తారు.

10 నుండి 15 సంవత్సరాల వరకూ పర్మినెంటు గ్రామాలలో చెంచులు నివశిస్తూ వుంటారు. కాని రెండు మూడేండ్ల కొకసారి యిండ్లు తిరుగ కట్టుకొన్నప్పుడు కొంచెము ప్రక్కలకు మార్చుకుంటూ వుంటారు. గ్రామాలలో ఏదైనా జబ్బు వ్యాపించి చాలామంది మరణిస్తూవుంటే ఆస్థలం వదలివేసి దూరంగా వెళ్ళి మరొకచోట గ్రామం నిర్మించుకుంటారు. లేక ఎక్కడివారక్కడ చెదరిపోతారు.

## గ్రామాలు

పర్మనెంట్ గ్రామాలు ఒకదానికొకటి చాలా భేదంగా వుంటాయి. అడవిలోవుండే గ్రామంలో సగటున 6 లేక 7 కుటుంబాలు వుంటాయి. పెద్ద

గ్రామాలువుంటే, అవికూడా చెదిరి దగ్గర దగ్గరగా చిన్న చిన్న గ్రామాలుగా తిరిగి పునర్నిర్మాణమవుతుంటాయి. కొందరు దగ్గర బంధువులు కలిసి, తమ జ్ఞాతుల యిండ్లకు దూరంగా వేరే యిండ్లు కట్టుకోవడం, లేక ఒక ఆవరణలోనే యిద్దరు ముగ్గురు దగ్గరచుట్టాలు యిండ్లు కట్టుకోవటం జరుగుతుంటుంది. మామూలుగా గ్రామంలో నివాసయోగ్యమైన యిండ్లే వుంటాయి. కొన్ని గ్రామాలలోని ప్రజలు బైట ప్రజలతో నిత్యసంబంధాలు కల్గివుంటే మేకలకొష్ఠాలు, గడ్డివాములు కూడా ఆగ్రామాల్లో వుండవచ్చు. చెంచుల గ్రామాలలో కమ్యూనిటీ భవనాలు ఏవీ వుండవు

## ఆహార సేకరణ

పీఠభూమి పైప్రాంతంలో చెంచులు అధిక భాగం అడవుల్లో దొరికే పండ్లు, మొక్కలు, దుంపలు తిని జీవిస్తుంటారు. యితర ఆదాయ సేకరణ మార్గాలు వారికి అంతగా వుండవు. ఈ ఆహార పదార్థాలను సేకరించుకోడంలో వారి నిత్యజీవితం గడుస్తుంటుంది. ఆహారం సేకరించుకోటానికి గడ్డపార, తట్ట అనే రెండు సాధనాలమీదనే వారు ఎక్కువగా ఆధారపడి వుంటారు ఋతుపవనాలు ప్రారంభం కాగానే అడవిలో ఎక్కడ చూచినా రకరకాల మొక్కలు పెరుగుతాయి. వాటిని చెంచుప్రజలు తింటారు

## పెంపుడు పశువులు

పీఠభూమి ప్రాంతంలోని చెంచులలో చాలా మంది వద్ద కుక్కలు మినహా మరే జంతువులు వుండవు. గ్రామాలలో మాత్రం గేదెలు, ఆవులు, మేకలు వున్న కుటుంబాలు వుంటాయి. దేశదిమ్మరితనం అలవాటైన వారైనా చెంచులు పశువుల పెంపకాన్ని చేపట్టారు.

## వ్యవసాయం

చెంచులకు పశువులను పెంచటమంటే ఎంత యిష్టమో, వ్యవసాయమంటే అంత అయిష్టం. అయితే వానాకాలంలో కొన్ని గ్రామాలలో కొందరు జొన్న, మొక్కజొన్న గింజలుచల్లి వ్యవసాయం ప్రారంభిస్తారు. కాని వారివి చాలా పాత పద్ధతులు.

## వ్యాపారం - వస్తువుల మార్పిడి

యిటీవల వస్త్రాలు, కుండలు, చేటలు, తిరుగళ్ళు మొదలగు వస్తువుల అవసరం చెంచుప్రజలలో ఎక్కువవుతూవుంది. బియ్యము, గింజధాన్యాలు మంచి ఆహారపదార్థాలుగా ఉపయోగపడతాయనే విషయం కూడా వారికి తెలిసింది. అడవుల్లో దొరికే నేయి, తేనె, యితర వస్తువులు యిచ్చి వారు తమకు కావలసిన వస్తువులు సేకరించుకొంటారు.

## సాంఘిక వ్యవస్థ :

అనాదికాలంలో వేటవలన జీవించే మానవులలో ఎటువంటి వ్యవస్థ వుండేదో, దాదాపు యిప్పటి చెంచుల సాంఘిక వ్యవస్థకూడా అలాగే వుంటుంది. అడవుల్లో వుండేవారైనా, పల్లపు ప్రాంతాలలోని వారైనా చెంచులందరూ పరిసరప్రాంతాల ప్రజలకంటే తామొక ప్రత్యేక జాతికి చెందినవారమని అనుకుంటారు. యితరులకు ఏదైనా సహాయంచేస్తే డబ్బులు అడిగేవారు, తమలోతాము ఉచితంగానే పరస్పరం సహాయం చేసుకుంటారు. కాని అందరూ కలిసికట్టుగా వుంటే జాతికంతకూ ప్రయోజనం ఉంటుందనే చైతన్యంలేదు. చెంచుల సంఘంలో ప్రధాన విభాగం తెగ. అంటే కుటుంబం, స్థానికంగా వుండే చుట్టాలు మొదలగువారు. పెండ్లిండ్ల విషయంలో చెంచులు తమతెగకు చెందిన, లేదా తమ బంధుప్రాయమైన తెగకుచెందిన పిల్లలను చేసు

కోరు. ఒక తెగకు చెందినవారి మధ్య స్త్రీ పురుష సంబంధాలు వుండకూడదు. తెగలోని వారిమధ్య ఆర్థికసహాయం కూడా దృఢంగా వుండదు. తేనె తెచ్చుటకు అడవికి వెళ్లినప్పుడు ఒక తెగకు చెందిన వాడు మరొక తెగవాడితో కలిసి వెళ్తాడు. కాని తనతెగలోని వారితో వెళ్లడు.

శాశ్వత గ్రామంలోవున్నా, తాత్కాలిక నివాసంలో వున్నా చెంచు తన జాతిమధ్య వున్నట్లుగానే జీవిస్తాడు. ఒకేస్థానంలో అందరూ వుంటారు. తేనె మొదలగునవి తెచ్చుకోటానికి ఒకేచోటుకు వెళ్ళుతుంటాడు. సంవత్సరం పొడుగునా, ఋతువు ఋతువుకూ ఒకచోటనుండి వేరొకచోటికి మారుతూ వుండే యీ చిన్న గ్రామంలోనివారిని గ్రామ ప్రజలు అనేదానికంటే స్థానిక కూటం అని వ్యవహరించవచ్చు. అంటే ఏసమయంలోనైనా ఒకే చోట వచ్చి కలిసిమెలిసి జీవించే కుటుంబాలన్న మాట. గ్రామప్రజలు అంటే శాశ్వత గ్రామంలో వుంటూ సమిష్టిజీవనం సాగించేవారు. చెంచుల గ్రామంలో సుమారుగా 3 నుంచి 10 కుటుంబాల వరకు వుంటాయి. యిటువంటి కుటుంబాలను స్థానిక కూటమి అనవచ్చు. వీరందరు దాదాపు ఒకేరకమైన పనిపాటలు చేసుకుంటూ అందరికీ ప్రయోజనకారి అయిన విధంగా జీవిస్తుంటారు. కొన్ని సందర్భాలలో ఏదోఒక రకానికి చెందిన పండ్లనో ఇతర ఆహారపదార్థాలనో సేకరించుకోవడానికి వారక్కడ నివాసమేర్పరచుకొని పనిచేస్తుంటారు. ఆ పదార్థాలను సాధ్యమైనంత ఎక్కువగా సేకరించుకొని అవి అక్కడ పూర్తిగా దొరకకుండా పోయిన సమయంలో వారు ఆప్రదేశాన్ని వదలివెళ్తారు. నిత్య జీవితంలో ఒకే జట్టువారిలో పూర్తిగా సమానత్వం వున్నట్లు కనిపిస్తుంది. కాని సూక్ష్మంగా చూస్తే వీరిలో రెండురకాలవారు వున్నారు. మొదటిరకం శాశ్వతసభ్యులు. ఆ ప్రాంతంలోనే పుట్టి అక్కడి భూములమీద హక్కు భుక్తాలవారు మరొకరకం తాత్కాలికసభ్యులు. స్నేహితులుగానూ, అతిథులుగానూ వీరువచ్చిచేరి పనిచేస్తుంటారు. ఈరెండురకాల సభ్యులకు అక్కడిపండ్లు మొదలగు వాటిమీద వుండే హక్కువిషయంలో విచక్షణ ఏమీలేదు. ఎందుకంటే ఒకేగ్రామంలో నివసించే వారందరికీ అక్కడ దొరికే వస్తువులమీద పూర్తిహక్కువుంటుంది. ఆగ్రామంలో నివాసమే వారికి ఆ హక్కును ప్రసాదిస్తుంది.

ఒక తెగలోని కుటుంబాలకు సంబంధించిన నిర్దిష్టమైన హక్కులు, బాధ్యతలు ఏమీ లేవు. ఏ కుటుంబమైన ఒక జట్టును వదలి మరొకజట్టులో చేరవచ్చు. అయినా ఒక జట్టుకు సంబంధించిన సభ్యులలో పరస్పర సహకార భావం ఎక్కువగా ఉంటుంది. అందువల్ల ఎవరైన కొన్ని రోజుల పాటు పక్కఊరికి వెళ్లినా తమ బిడ్డలను ఇక్కడి వారు శ్రద్ధగా చూస్తారనే ధైర్యం వుటుంది. ఎవరికైనా జబ్బుచేస్తే వారి స్వంత కుటుంబం అక్కడ లేని పక్షంలో ఇతర కుటుంబాలకు చెందిన వారందరూ రోగికి సేవ చేస్తారు.

ఈ విధమైన జ్ఞాతిప్రేమ చెంచు ప్రజలలో చాలా ప్రధాన మైనది. వారిని కూడదీసి వుంచేశక్తి కూడా అదే. జ్ఞాతుల జట్టులో ఆయా కుటుంబాలలో వుండే పరస్పర సహకార ప్రేమ భావాలు విశాలమైన పరిధిలో అమలు పరచ బడి ఇల్లు దగ్గరగా వున్నా దూరంగా వున్నా తమ వారికి సహాయం చేయాలనే అభిలాష ఎక్కువగా వుంటుంది. జ్ఞాతుల జట్టులో అందరికీ సమిష్టి ప్రయోజనం అనే ఆశయం పనిచేస్తుంటుంది. మొత్తం తెగమీద చూసుకుంటే ఈ ఆశయంవుండదు. ఈ ఆశయమే చెంచుల సాంఘిక వ్యవస్థలో వివిధజట్టులు కలసి మెలసి పనిచేసుకోవడానికి ప్రోత్సాహమిస్తున్నది, జ్ఞాతుల జట్టులో కలసి

-మెలసి జీవించేలక్షణంవున్నా ఎవరెవరి భాధ్యతలు ఏమిటో సరిఅయినవిర్వచనంలేదు. చెంచులను అడిగినా వారుకూడస్పష్టంగాచెప్పలేరు తగాదాలువచ్చినపుడు మాత్రం తమ సంబంధికులకు మద్దతునిస్తారు. ఏదైనా ఒక ఆచారాన్ని ఉల్లంఘించి చిక్కులో పడినవాడు బాగా పలుకు బడివున్న తనజ్ఞాతి గ్రామానికి వెళ్ళి నివశిస్తాడు.

## పెద్దమంచి

ప్రతి చెంచు గ్రామంలోనూ ఒక పెద్ద వుంటాడు. ఆయనను "పెద్దమంచి" అని పిలుస్తారు. బయటి ప్రజలతో చెంచులకు గల లావాదేవీలలో ఆయన ప్రముఖ పాత్ర వహిస్తాడు. అధికారం ఎక్కువగా వుండదు. గ్రామంలోఎక్కువ ప్రాతినిధ్యంగల తెగకు చెందినవాడు "పెద్ద మంచి" గా వుంటాడు. సామాన్యంగా వృద్ధుడు లేక మధ్య వయస్కుడు "పెద్దమంచి"గా వుంటాడు. కాని గ్రామంలో అందరి కంటే వృద్ధుడే ఈ హోదాలో వుండాలనే నియమం లేదు.

పెద్దమంచికి వుండే హక్కు ఎమిటంటే ఉత్సవాలు, విందుల సమయంలో ముందుగా ఆరగిస్తాడు కాని ఆయనకు ఎక్కువ పదార్థం ఇవ్వాలనే నియమం లేదు. ఇతర సభ్యులు అతనికేదైదయినా విరాళాలివ్వ వలసిన అవసరం లేదు. వేటలలో సేకరించ బడిన పదార్థముల మీద అతడికి ప్రత్యేక హక్కు లేవీలేవు. చెంచు ప్రజలందరూ కలసి దేవతలకు కొలుపులు చేసేటప్పుడు మొదట్లో పెద్దమంచి ప్రార్థన జరుపుతాడు. పెండ్లిండ్లలో వధూవరులను ఆశీర్వదిస్తాడు. గ్రామంలోని ప్రజలు పోట్లాడు కుంటే పోట్లాటతో సంబంధంలేని వ్యక్తుల సహాయంతో తగాదాలు పరిష్కరించడానికి ప్రయత్నిస్తాడు. తగాదా పరిష్కారం ఆయ్యేదీ కానిదీ అతని వ్యక్తిత్వం మీద, న్యాయ నిర్ణయశక్తిమీద ఆధార పడి వుంటుంది. ఎక్కువగా దగ్గర బంధువులుకల గ్రామాలలోని పెద్దమంచికి సాధారణంగా మాట బాగా సాగుతుంది. వివిధ జ్ఞాతి జట్టులు గల గ్రామాలలో పెద్దమంచి మాట అంతగా సాగదు. శిక్షించ డానికీ, జుల్మానా వేయడానికి పెద్దమంచికి అధికారం లేదు. గ్రామంలో ఏ సభ్యుడైనా తన జట్టిను వదిలి మరొక జట్టులో చేరడానికి పూర్తి స్వేచ్ఛ ఉన్నందున పెద్దమంచి అతని మీద ఏదైనా చర్య తీసుకోబోయినా ప్రయోజనం ఉండదు.

పెద్దమంచి పదవికి ఎవరు రావాలలి అనే విషయంలో స్పష్టమైన నియమూ లేవీ లేవు. ఎవరైనా సరే తన పలుకుబడితో శక్తిసామర్థ్యాలతో ఆ పదవి పొందవచ్చు. దీనికి సరి అయిన ఎన్నిక విధానం కూడా వున్నట్లు కనిపించదు. మంచి తనాన్నిబట్టి కాల క్రమేణా ఒకవ్యక్తి పెద్దమంచిగా గుర్తింప బడుతాడు. పెద్దమంచి పదవి గురించిన సందిగ్ధత, దాని కంత ప్రాధాన్యత లేక పోవుటను బట్టి చెంచుల సంస్కృతిలో ఈ పదవి ధృఢంగా లేదని తెలుస్తున్నది.

చెంచు ప్రజలు కూడా చాలా వరకు ఇతర ఆదిమ జాతుల వంటివారే. ప్రజాసామ్య భావన వ్యాపించిన వారే. పెద్దమంచి యొక్క అధికారం ఎక్కువగా అతని శీలం, శక్తి సామర్థ్యాల మీద ఆధార పడి వుంటుంది.

## ఆస్తి :

ఇటీవల వరకు చెంచు ప్రజలు నివశించే ప్రాంతంలోని భూమియే వారికున్న విలువగల ఆస్తి. కాని దీనిని రాష్ట్ర అటవీశాఖ వారు తీసుకున్నారు. అటవీశాఖ పరం అయిన తరువాత భూమి మీద వ్యక్తిగతంగా గానీ జాతిగా గానీ దానిమీద ఎవరికీ యాజమాన్యం వుండదు. సిద్ధాంతరీత్యా చూస్తే దీనివల్ల చెంచు ప్రజలకు పూర్వం నుండి వున్నహక్కు తొలగి పోయినట్లే, న్యాయశాస్త్రందృష్ట్యా చెంచు ప్రజల పరిస్థితిలో ఇది పెద్ద మార్పు తెచ్చింది. లోగడి ఆ భూమికి చెంచు ప్రజలే అభ్యంతరం లేని అధికారులు. ఇప్పుడు అక్కడ వారి వునికిని మరొకరు సహించి వూరుకోవడం వల్లనె వారక్కడ వుంటున్నారు. కాని అనాదిగా తమ పూర్వీకుల నివాసమై వారి హక్కు భుక్తాలలో వున్న అటవీప్రాంతం ఇప్పుడు తమది కాదంటే ఎందుకు ఈ విధంగా అయిందో చెంచులకు సామాన్యంగా అర్థంకాదు.

ప్రతి గ్రామానికి కొంత భూమి వుంటుంది. అది సమిష్టి ఆస్తి. అంటే సభ్యుల అందరి ఆస్తి. అక్కడి పర్మినెంటు సెటిల్‌మెంటు పేరు తోనే ఆ భూమి పిలువ బడుతుంది. ఒకప్రాంతం సరి హద్దులను ఇతర ప్రాంతాల జట్టులలోని వారు గౌర విస్తారు. ఒక గ్రామానికి చెందిన భూమిలో పండ్లు, దుంపలు ఇతర జట్లలోని వారు సేకరిస్తుంటే వారిని పట్టుకొని ఆ పదార్థాలు స్వాధీనం చేసుకుంటారు. ప్రయాణం చేస్తున్నప్పుడు మాత్రం దారిలో ఏప్రాంతంలోనైనా తనకు తక్షణ అవసరమైనంత మేరకు ఎవరైనా ఆహార పదార్థాలు సేకరించుకో వచ్చు. కాని వాటిని ఆ ప్రాంతం సరిహద్దులను దాటి తీసుకు పోరాదు.

భూమికి సంబంధించినంత వరకు చెంచులలో వ్యక్తి యాజమాన్యం లేదు. అంతేకాక ఒకవ్యక్తి పెంచిన చెట్లైనాసరే వాటిమీద అతనికి వ్యక్తిగత అధికారం ఉండదు. వానాకాలంలో పెంచే గింజ ధాన్యాలు మొక్కజొన్న పైర్ల విషయంలో మాత్రం పరిస్థితి వేరు. వీటి విషయంలో అవి పెంచినవారి అధికారం గుర్తించబడు తుంది. పైరు కోసిన తరువాత మాత్రం ఆ భూమి మళ్ళీ సమిష్టి ఆస్తి అవుతుంది.

భూమి అంతా సమిష్టి ఆస్తిగా పరిగణింపబడినా వ్యక్తి ఆస్తి విధానాన్ని గురించి స్పష్టమైన అభిప్రాయాలే వున్నవి. ఏ వస్తువు తయారు చేయడానికైనా ఒక వ్యక్తిచేసే శ్రమవల్ల ఆ వ్యక్తికి దానిమీద యాజమాన్యం లభిస్తుంది. కాని ఆ వస్తువు ప్రయోజన రహితంగా వున్నంతకాలం అది సమిష్టి ఆస్తిగా పరిగణించబడుతుంది. వేటలో చచ్చిన జంతువులు వేటకానివే. అదేవిధంగా పరికరాలు, ఆయుధాలు, ఇంటి సామగ్రి కూడా. వ్యక్తి ఆస్తి విషయంలో స్త్రీ పురుషులకు సమాన హక్కులున్నవి. కొందరు స్త్రీలకు పెండ్లి సమయంలోకానీ, తరువాతకాని పుట్టింటివారిచ్చిన గేదెలు వుంటాయి ఇవి యింకా ఆభరణాలు, పాత్రలు మొదలైనవి వారి వ్యక్తిగత మైన ఆస్తిగా పరిగణించబడతాయి.

## ఆచారాల ఉల్లంఘన

యాభై లేక వంద సంవత్సరాలకు పూర్వం నవీన కాలపు ఆచారాలను గురించి చెంచు ప్రజలకు వున్న అభిప్రాయాలకు ఇప్పటికి చాలా తేడావుంది. పూర్వ కాలంలో చెంచులు స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రజలు ఆనాడు వారుచేసిన న్యాయ విరుద్ధ చర్యలకు శిక్ష వారి సంఘ సభ్యులే విధించేవారు. ఇప్పుడు హత్యలు మొదలైన నేరాలలో బయటి అధికార్లు అంటే పోలీసులు, కోర్టుల అధికారానికి వారు లోబడవలసి వచ్చింది. చెంచు ప్రజలలో ప్రాయిశ్చిత్తమువల్ల ఏ నేరమైనా పాపుకొనవచ్చనే అభిప్రాయంవుంది. మామూలుగా తప్పు చేసినవారికి అనుశ్రుతంగా వస్తున్న ప్రాయశ్చిత్త పద్ధతి ఏమంటే సంఘంలో నలుగురు పెద్దలను పిలిచి విందు చేయడం. తప్పు చేసినవారికి జుల్మానా విధించటం గుర్తించి కూడా చెంచులు మాట్లాడుతుంటారు. అంటే దీని అర్థం జుల్మానా వసూలుచేసి నష్టపడినవారికి దానిని చెల్లించడంకాదు. కౌన్సిల్‌లోని పెద్ద మనుష్యులకు విందు చేయడానికిగాను ఆహార పదార్థాలకు, సారాయికి అయ్యే ఖర్చులు వసూలు చేయడమనే దాని భావం. ఆ విధంగా చెయ్యడానికి నేరస్థుడు నిరాకరించి నట్లయితే అతనికివున్న దూడనుగానీ, మేకనుగాని పెద్దలు లాక్కుంటారు. మేక అయితే అప్పటికప్పుడే కోయడమవుతుంది. దూడ అయితే దాన్నించి

ధాన్యం తెస్తారు. విందు పూర్తి కాగానే నేరం తొలగినట్లే. నేరస్థునికి సంఘంలో మళ్లీ మామూలు స్థానం లభిసుంది. బాగా అభివృద్ధి పొందిన ప్రజలలో జరిగే కొన్ని కొన్ని నేరాలు చెంచుప్రజలకు తెలియనే తెలియవు. వారిలో దొంగతనంలేదు, సామాన్యంగా చెంచుల్లో స్త్రీ పురుష సంబంధాలవల్లనే ఎక్కువగా తగాదాలు వస్తాయి. పెండ్లికి సంబంధించిన తగాదాలు, వ్యభిచారం, లేవనెత్తుకుపోవడం, భార్య భర్తయింటికి పోవడానికి నిరాకరించడం, భర్త భార్యను వెళ్ళగొట్టడం—ఇటువంటి తగాదాలు సంభవించినప్పుడు మాత్రమే పెద్ద మంచి సభలు జరుగుతుంటాయి,



# పార్లమెంటు, రాష్ట్ర లెజిస్లేచరు

(శ్రీ డి. సూర్యనారాయణస్వామి, రాష్ట్ర ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శి)

ప్రజాస్వామ్య రిపబ్లిక్‌లో ప్రజాభీష్టానికి ప్రాతినిధ్యం వహించే పార్లమెంటు లేక లెజిస్లేచర్ ప్రభుత్వ విధానాలను అదుపులో పెట్టే పరమాధికారి. భారత రాజ్యాంగం యీ పరమాధికార పరిరక్షణకి అనువుగా తయారు చేయబడింది; అయితే దానికి అవసర మయిన హద్దులుకూడా యేర్పరచబడ్డాయి. దిగువ యీ సందర్భంలో రాజ్యాంగంలో యేర్పరచబడిన ప్రధాన నిబంధనలు వివరించబడ్డాయి.

**పార్లమెంటు :-** భారతదేశ పార్లమెంటులో రాష్ట్రపతి, రాజ్యసభ, లోక్‌సభ వుంటాయి. ప్రభువుల సభవలె రాజ్యసభను రద్దుచేయుటకు వీలులేదు. లోక్‌సభ రద్దుఅయినప్పుడు కూడా అది సమావేశ మయి పని జరుపవచ్చు. అధ్యక్షుడు పార్లమెంటులో కూర్చొనడు. పార్లమెంటు ప్రధాన కర్తవ్యం శాసననిర్మాణం. మంత్రివర్గసభ్యులు మామూలుగా దానినుంచే తీసుకొనబడి, దానికే బాధ్యతవహిస్తారు. ప్రశ్నలు, తీర్మానాలద్వారా అది మంత్రులచర్యను అదుపులో పెడుతుంది. ప్రభుత్వ ఆదాయ వ్యయాలను నిర్ణయించే బడ్జెట్టును ఆమోదిస్తుంది. కొంత కాలాని కొకసారి రాష్ట్రపతి పార్లమెంటు వుభయ సభలను తాను వుచితమని తలచినసమయం, స్థలాలలో సమావేశ పరచాలి; అయితే దాని ఆఖరు సమావేశానికి, ఆతరువాత సమావేశానికి మధ్య ఆరు నెలలు గడువ కూడదు. రాష్ట్రపతి అప్పుడప్పుడు వుభయసభలను కాని రెండిటిలో యేఒక్కసభనైనా కాని కొంతకాలం వాయిదా (ప్రొరోగ్) వేయవచ్చు; లోక్‌సభను రద్దుచేయవచ్చు; వుభయసభలలో యేఒక్కటి కాని లేక వుభయసభలు కలిసికాని సమావేశ మయినపుడు సభ్యుల నుద్దేశించి ప్రసంగించవచ్చు: అందునిమిత్తం సభ్యులు హాజరు కావాలని అడుగవచ్చు; పార్లమెంటులో వాయిదాలో వున్న బిల్లుల విషయంలోకాని యితర విషయాలలో కాని వుభయసభలలో దేనికయినా ఆయన సందేశాలు పంపవచ్చు; అలా సందేశం పంపబడినసభ ఆసందేశంలో చెప్పిన విషయాన్ని పరిశీలించాలి. ప్రతిఒక్కమంత్రి, ఇండియా అటార్నీజనరలు వుభయ సభలలో దేనిలోనయినా మాట్లాడవచ్చు, కార్యక్రమంలో యితరత్రా పాల్గొనవచ్చు, అయితే యీ నిబంధనవల్ల వారికి ఓటుచేసేహక్కు వుండదు. బిల్లులను సాధారణంగావుభయసభలు విడివిడిగా సమావేశమయి ఆమోదిస్తాయి. రాష్ట్రపతి సమ్మతి లభించుటతో అది శాసనం అవుతుంది.

**రాజ్యసభ :-** రాజ్యసభ సభ్యులసంఖ్య 250 కి మించరాదు. వారిలో 12 మంది రాష్ట్రపతిచే నియమించబడతారు. రాష్ట్రాలు, కేంద్ర భూభాగాల ప్రతినిధులచే భర్తీచేయబడవలసిన రాజ్యసభ స్థానాల కేటాయింపు, యీ విషయంలో రాజ్యాంగం నాలుగవ షెడ్యూలులోగల నిబంధనల కనుగుణంగా జరగాలి. రాష్ట్రపతిచే నియమింపబడే సభ్యులు సారస్వతం, విజ్ఞానశాస్త్రం, కళలు, సాంఘిక సేవవంటి విషయాలలో ప్రత్యేక పరిజ్ఞానంలేక ప్రత్యక్షానుభవం కలవారై వుండాలి. రాజ్యసభలోని ప్రతిరాష్ట్ర ప్రతినిధులు ఆరాష్ట్ర శాసనసభకి యెన్నికయిన సభ్యులచే సంబంధసామ్య (ప్రొపోర్షనల్) ప్రాతినిధ్య పద్ధతిలో సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటుద్వారా యెన్నుకొనబడాలి. రాజ్యసభలో కేంద్ర భూభాగాల ప్రతినిధులు పార్లమెంటు శాసనరీత్యా నిర్ణయించినవిధంగా యెన్నబడాలి.

రాజ్యసభలో స్థానాలు దగ్గరగా జనాభానిష్పత్తిలో కేటాయింపబడతాయి.

| | |
|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 18 |
| అస్సాం. | 7 |
| బీహారు | 22 |
| బొంబాయి | 27 |
| కేరళ | 9 |
| మధ్యప్రదేశ్ | 16 |
| మద్రాసు | 17 |
| మైసూరు | 12 |
| ఒరిస్సా | 10 |
| పంజాబు | 11 |
| రాజస్థాన్ | 10 |
| ఉత్తరప్రదేశ్ | 24 |
| పశ్చిమబెంగాలు | 16 |
| జమ్మూ-కాశ్మీరు | 4 |
| ఢిల్లీ | 3 |
| హిమాచల్ ప్రదేశ్ | 2 |
| మణిపూర్ | 1 |
| త్రిపురా | 1 |
| మొత్తం | 220 |

ప్రతి రెండవసంవత్సరము రాజ్యసభలో మూడవ వంతు సభ్యుల విరమణద్వారా దానిలో క్రొత్త సభ్యులు చేరుతూవుంటారు. ఈసభకి యెన్నుకొనబడే అభ్యర్థి భారతీయ పౌరుడై వుండి 35 సంవత్సరాలకు తక్కువకాని వయస్సు కలిగివుండాలి. బుద్ధిబలం, వ్యవహారజ్ఞానం కలిగివుండి, ఎన్నికల తతంగంలో ప్రవేశించనొల్లని వ్యక్తులు రాజకీయాలలో పాల్గొనుటకు యీసభ అవకాశం కల్పిస్తుంది. ఈసంస్థ వ్యక్తులకంటె యెక్కువగా రాష్ట్రాలకి ప్రాతినిధ్యం వహిస్తుంది, రాష్ట్రహక్కులను కాపాడుటలో దానికి ప్రత్యేక బాధ్యతవుంది. ఉదాహరణకు, రాష్ట్ర రంగంలో పార్లమెంటు శాసనం చేయుటకై రాజ్యసభలో మూడింట రెండువంతుల ప్రత్యేక మెజారిటీ ముఖ్యం. దానిపని శాసనాన్ని వీటోచేయుట కాకయేశాసన చర్యనయినా ప్రశాంతంగా చర్చించుట.

ఇండియా వుపాధ్యక్షుడు రాజ్యసభ ఎక్స్ అఫీషియో అధ్యక్షుడు. ఆయన లాభకరమయిన మరే పదవిని స్వీకరించరాదు. రాజ్యసభ దాని సభ్యులలో ఒకరిని వుపాధ్యక్షులుగా యెన్నుకుంటుంది. రాజ్యసభ సమావేశమయినపుడు దాని అధ్యక్షుడు రాకపోతే వుపాధ్యక్షుడు ఆయనకూడా రాకపోతే, సభ కార్యవిధానం నిబంధనలు నిర్ణయించేవ్యక్తి, అట్టి వ్యక్తి హాజరుకాకపోతే, సభవారు నిర్ణయించగల వ్యక్తి అధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు. ప్రతి సభకి సెక్రటేరియల్ సిబ్బంది వుంటుంది. పార్లమెంటు వుభయసభలలోను యేఒక్కదాని సెక్రటేరియల్ సిబ్బంది విషయంలోనయినా నియామకం, నియమించబడిన వ్యక్తుల వుద్యోగ నిబంధనలను పార్లమెంటు శాసనరీత్యా క్రమబద్ధం చేయవచ్చు. అట్టి నిబంధన చేయబడేవరకూ, రాష్ట్రపతి లోకసభ అధ్యక్షుడు లేక రాజ్యసభ అధ్యక్షునితో సంప్రదించి సెక్రటేరియల్ సిబ్బంది నియామకం, వారి వుద్యోగ నిబంధనల విషయంలో నిబంధన చేయవచ్చు. అలా చేయబడిన యే నిబంధనలయినా పార్లమెంటు చేసిన యే శాసన నిబంధనకయినా లోబడి అమలు జరుగుతాయి.

లోకసభ, అంతకుముందు రద్దుచేయబడితే తప్ప, దానిమొదటి సమావేశానికి నిర్ణయించ బడిన తేదీ నుంచి 5 సంవత్సరాలు పనిచేస్తుంది. ఆతరువాత రద్దయిపోతుంది. అయితే, అత్యవసర పరిస్థితి ప్రకటన (ప్రొక్లమేషన్) అమలులో ఉనట్లయితే పైకాలాన్ని పార్లమెంటు శాసనంద్వారా పొడిగించవచ్చు. ఈ గడువు యే ఒక్కసారి ఒకసంవత్సరానికి మించి పొడిగించబడ కూడదు; అలాగే యేసందర్భంలోనూ అది ప్రకటన అమలు నిలిచిన పిమ్మట ఆరునెలలు దాట కూడదు. ఆంగ్లోయిండియన్ల ప్రాతినిధ్యానికై రాష్ట్రపతి ప్రత్యేక నిబంధనను చేయవచ్చు. రాష్ట్రాలలో ఎన్నికయిన ప్రతినిధులు 500 మంది కిమించ రాదు. వారు ఎన్నికయే నియోజకవర్గాలు ప్రతి 7,50,000 మందికి ఒక సభ్యుడుకంటె తక్కువ

కాకుండాను, ప్రతి 5,00,000 మందికి ఒక సభ్యుడు కంటె యెక్కువగాకుండాను యేర్పాటు చేయ బడాలి. ఇందువల్ల దేశమంతటా ఒక నియోజకవర్గం సభ్యులసంఖ్య, జనాభాల నిష్పత్తి సాధ్యమైనంత వరకూ ఒకే విధంగా వుంటుంది. కేంద్ర భూభాగాలకు యెన్నుకొనబడే ప్రతినిధులసంఖ్య 20 మించగూడదు. నియోజక వర్గాలయేర్పాటు పార్లమెంటు శాసనం ద్వారా చేయబడాలి, కాని ఒక నియోజకవర్గం సభ్యులసంఖ్య, దానిజనాభాల నిష్పత్తి ప్రకటించ బడిన గతజనాభా లెక్కలపై ఆధారపడి వుండాలి. జనాభా లెక్కలు పదిసంవత్సరాల కొకసారి తీసు కొనబడతాయి. అందువల్ల నియోజక వర్గాలను మళ్ళీ మళ్ళీ సర్దుబాటు చేస్తూవుండాలి. అయితే అట్టిసర్దుబాటు వల్ల, అప్పటిసభ రద్దయేవరకూ లోక సభ ప్రాతినిధ్యంలో మార్పురాకూడదు. నియోజక వర్గాల యేర్పాటులేక స్థానాల కేటాయింపు విష యంలో చేయబడిన శాసనాన్ని న్యాయస్థానంలో సవాలుచేయుటకు వీలులేదు. లోకసభ సభ్యత్వం కోరే అభ్యర్థి భారతీయ పౌరుడై వుండాలి; 25 సంవ త్సరాలకు లోబడని వయస్సు కలిగివుండాలి. పార్ల మెంటు వుభయసభలలో యే ఒక్కదానికయినా యెన్నికగుటకు, దాని సభ్యుడుగా వుండుటకు ఒక వ్యక్తికి దిగువ సందర్భాలలో అర్హతవుండదు :-

1 అర్హతకలుగదని పార్లమెంటుచే శాసనరీత్యా ప్రకటింప బడిన పదవితప్ప కేంద్రప్రభుత్వం లేక యేదైనా రాష్ట్రప్రభుత్వంలో మరో లాభసాటి పదవిలో వుంటేను;

2 మనస్థిరంలేక తగిన న్యాయస్థానంచే అలాప్రకటిం చబడితేనూ.

3 అన్ డిశ్చార్జిడు ఇన్‌సాల్వెంటు అయితేను,

4 భారతీయ పౌరుడు కాకపోతేను లేక ఐచ్ఛి కంగా అన్యదేశ పౌరసత్వాన్ని పొందితేను లేక అన్యదేశంపట్ల భక్తికలిగి వున్నాడని లేక దానిని అనుసరిస్తున్నాడని తేలితేను ;

5 పార్లమెంటుచే కాని పార్లమెంటు చేసిన శాసనం క్రింద కాని అనర్హుడని ప్రకటింపబడితేను ;

ఈ అనర్హతల ప్రయోజనాలకై, కేంద్ర ప్రభు త్వంలోకాని యేదైనా రాష్ట్ర ప్రభుత్వంలోకాని మంత్రిగా వున్నవారు ఆయా ప్రభుత్వాలలో లాభ సాటి పదవిలో వున్నట్లు పరిగణింపబడకూడదు.

జాబితాల తయారీ, ఎన్నికల నిర్వహణ ఎన్నికల కమిషన్ అజమాయిషీక్రింద జరుగుతాయి. దాని సభ్యులు రాష్ట్రపతిచే నియమింపబడుతారు. ఎన్నిక లలో వచ్చిన వివాదాలను పై కమిషన్‌చే నియ మింపబడిన యెన్నికల ట్రిబ్యునల్‌ల ముందే ప్రశ్నించ వచ్చు. ఎవరూకూడా ఒకేసారి పార్లమెంటు వుభయ సభలలోను సభ్యుడుగా వుండజాలరు ; అలాగే ఎవరూకూడా ఒకేసారి పార్లమెంటు సభ్యుడుగాను, రాష్ట్ర శాసనసభ సభ్యుడుగాను వుండజాలరు. పార్ల మెంటు వుభయసభలలోను దేని సభ్యుడయినా రాజీనామా యివ్వవచ్చు, అతడు సెలవులేకుండా 60 రోజులు హాజరుకాకుండా వుండవచ్చు. పార్ల మెంటులో కూర్చొనుటకు తన కర్హతలేదని పూర్తిగా తెలిసి అలాచేసిన వ్యక్తికి రోజుకి 500 రూపాయలు జరిమానా విధించవచ్చు. లోకసభ అధ్యక్షు, వుపాధ్యక్షు లను యెన్నుకుంటుంది ; వారిద్దరూ కూడా ఆ సభ సభ్యులై వుండాలి. అధ్యక్షుడు లేక వుపాధ్యక్షుడు రాజీనామా చేయవచ్చు, లేక 14 రోజుల నోటీసు యివ్వబడిన తీర్మానం ద్వారా తొలగింపబడవచ్చు. పార్లమెంటు యే సభ సభ్యుడయినా తన స్థానాన్ని స్వీకరించేముందు అధ్యక్షుడు లేక యీ సందర్భంలో అతనిచే నియమింపబడిన వ్యక్తులముందు, మూడవ షెడ్యూలులో నిర్దేశించబడిన రీతిగా ప్రమాణాన్ని లేక ధృవీకరణను స్వీకరించాలి. రాజ్యాంగంలో మరొక విధంగా వసతి కల్పించబడితేతప్ప యే ఒక్క సభ సమావేశంలోనయినా లేక వుభయసభల సమిష్టి సమావేశంలోనయినా వుత్పన్నమయే ప్రశ్నలు సమావేశానికి హాజరై ఓటింగులో పాల్గొనే సభ్యు లలో, అధ్యక్షుడు లేక అధ్యక్షుడుగా వ్యవహరించే వ్యక్తి మినహా, అధిక సంఖ్యాకులచే నిర్ణయించ బడాలి. రాజ్యసభ, లోకసభల అధ్యక్షులు లేక వారి స్థానంలో పనిచేస్తున్న వ్యక్తులు మొదటిసారి ఓటు చేయకూడదు, కాని ఓట్లు సరిసమానంగా వచ్చిన సందర్భంలో కేస్టింగు ఓటు వేయవచ్చు. పార్లమెంటు

కార్యవిధానం, అందులో కొంత అసంగతం జరిగినదని తరువాత తెలిసినంతమాత్రాన, చెల్లకపోదు. పార్లమెంటు శాసనరీత్యా మరొకలా ప్రకటిస్తేతప్ప దానికిచెందిన యే సభసమావేశానికయినా కావలసిన సభ్యుల కనీస సంఖ్య (కోరం) సభ మొత్తం సభ్యుల సంఖ్యలో పదవవంతు. సభ సమావేశంలో యే సమయంలోనయినా కోరం లేకపోయినట్లయితే, అధ్యక్షుడు లేక అధ్యక్షుడుగా వ్యవహరిస్తున్న వ్యక్తి సభను వాయిదావేయాలి లేక కోరం వచ్చేవరకూ సమావేశాన్ని నిలుపుచేయాలి.

## సభాహక్కులు, అవధులు

పార్లమెంటు తన పనుల్ని సమర్ధంగా చేయాలంటే, దాని సభ్యులకు వ్యక్తిస్వాతంత్ర్యము, ప్రసంగ స్వాతంత్ర్యము వుండాలి. వాటికి ఒక హద్దుకూడా యేర్పాటు కావాలి. రాజ్యాంగంలో రక్షణలు, హద్దులుకూడా వున్నాయి. ప్రతి సభ తన నిబంధనలు తానే చేసుకోవచ్చుకూడా. మామూలు పౌరుని ప్రసంగ స్వాతంత్ర్య మూలహక్కు కోర్టునింద, ధిక్కారాలకి సంబంధించిన చట్టాలచే పరిమితం చేయబడుతున్నది; కాని అవి పార్లమెంటు వుభయ సభలలోను దేనిలోనయినా ప్రసంగించే పార్లమెంటు సభ్యులకు వర్తించవు. అయితే, రాజ్యాంగం ప్రకారం, సుప్రీంకోర్టు లేక హైకోర్టు న్యాయమూర్తుల నడవడికనుగురించి, వారిని తొలగించుటకు తెచ్చిన తీర్మానంపై తప్ప చర్చించరాదు. పార్లమెంటులో అన్న యేదైనా ఒక మాట విషయంలోను లేక పార్లమెంటు యే సభయిచ్చిన అధికారంరీత్యా నయినా యే వ్యక్తి అయినా చేసిన యేదైనా ప్రచురణ విషయంలోను, పార్లమెంటు కార్యవిధానం విషయంలోను చట్టరీత్యా చర్య తీసుకొనుటకు కూడా రాజ్యాంగం సమ్మతించదు. ప్రస్తుత నిబంధనల క్రింద వుభయసభలలోను దేనిలోనయినా సభ్యులు చేసే ప్రసంగం సందర్భోచితంగా వుండాలి. అది సభా వ్యవహారానికి ఆటంకం కలుగచేయరాదు. సభ మరొక సభ్యునిపై వ్యక్తిగతంగా నేరారోపణ చేయబడకూడదు. ప్రసంగంలో సబ్-జుడీస్ ప్రశ్నల ప్రసక్తి వుండకూడదు. పార్లమెంటు సమావేశానికి ముందు 40 రోజులు, వెనుక 40 రోజులు పార్లమెంటు సభ్యులను సివిల్ ప్రోసెస్‌పై అరెస్టు చేయకూడదు, కాని సివిల్ ప్రోసెస్ యితర రూపాల అమలునుంచి వారికి మినహాయింపు యివ్వబడదు. ఈ రక్షణ ఇన్సాల్వెన్సీ ప్రొసీడింగులకు, నేరవిచారణ విషయంలో అరెస్టుకి వర్తించదు.

ప్రతిసభకి ఒక సంస్థగా కొన్ని విశేష హక్కులు, రక్షణలు వున్నాయి. అధికసంఖ్యాకుల నిర్ణయంతో అది కొత్తవారినందరినీ సభకి అవతల వుంచవచ్చు. అధ్యక్షస్థానంలోనున్న వ్యక్తి అసంగతమయిన, అసందర్భమయిన ప్రసంగాలను ఆపుచేసి సభాసభ్యులను మందలించవచ్చు. తప్పుగా ప్రవర్తించిన సభ్యుడు సస్పెండు చేయబడవచ్చు లేదా తొలగించబడవచ్చు. తప్పుగా ప్రవర్తించిన లేక ధిక్కారంచేసిన కొత్త వ్యక్తి తక్కిన పార్లమెంటు సమావేశం ముగిసేవరకూ ఖైదులో పెట్టబడవచ్చు. సభాహక్కులను, నిబంధనలను వుల్లంఘించే సభ్యులను, పైవారినికూడా సభ వారు శిక్షించవచ్చు; సాధారణంగా సభకి తన సరిహద్దులలో స్వయం పరిపాలనా స్వాతంత్ర్యం వుంటుంది.

## శాసనసభా కార్య విధానం

డబ్బు బిల్లులు, ఆర్థిక సంబంధమయిన యితర బిల్లుల విషయంలో రాజ్యాంగం 109,107 సూత్రాలకు లోబడి, ఒక బిల్లు పార్లమెంటు యే సభలోనయినా ప్రతిపాదింపబడవచ్చు. 108,109 సూత్రాల నిబంధనలకు లోబడి, వుభయసభలచేతా, సవరణలు లేకుండాకాని వుభయసభలచే అంగీకరించబడిన సవరణలతో కాని, అంగీకరింపబడితే తప్ప ఒక బిల్లును సభలు ఆమోదించినట్లుగా పరిగణించకూడదు. పార్లమెంటులో వాయిదాలోనున్న బిల్లు సభలు వాయిదా వేయబడుటవల్ల మురిగిపోదు. రాజ్యసభలో వాయిదాలోవుండి లోకసభ ఆమోదాన్ని పొందని బిల్లు లోకసభ రద్దయిపోయినా మురిగిపోదు. లోకసభలో వాయిదాలో వున్న బిల్లు లేక ఆ సభచే ఆమోదింపబడి రాజ్యసభలో వాయిదాలో నున్న బిల్లు, 108 వ. సూత్రానికి లోబడి లోకసభ రద్దయినప్పుడు మురిగిపోతుంది. ఒక సభ ఆమోదించిన బిల్లు మరొక

సభచే తోసి పుచ్చబడితే, లేక కొన్ని సవరణల విషయంలో రెండు సభలు యేకీభవించ లేకపోతే, లేక ఒక సభ ఆమోదించిన బిల్లు మరొక సభకి అంది అది దానిచే ఆమోదించ బడకుండా ఆరునెలలు గడచి పోతే, రాష్ట్రపతి సమష్టి సమావేశాన్ని యేర్పరచ వచ్చు; అక్కడ హాజరయి, ఓటింగులో పాల్గొనేవారిలో అధిక సంఖ్యాకులు దానిని ఆమోదించినట్లయితే, అది వుభయ సభలచేత ఆమోదించ బడినట్లు పరిగణింప బడుతుంది. సభలు సవరణల విషయంలో యేకాభిప్రాయానికి రాకపోతే, యేకీభవించని విషయానికి సంబంధించి సందర్భ శుద్ధిగల యే అంశమయినా ప్రస్తావించబడవచ్చు.

రాజ్యాంగంచే అది ఆజ్ఞాపింపబడిన మేరకు తప్ప, ప్రతి సభ తన కార్య విధానాన్ని తాను నడుపుకుంటుంది. డబ్బు బిల్లు రాజ్యసభలో ప్రతిపాదింప బడకూడదు. ఒక బిల్లులో దిగువ విషయాలు అన్నీ లేక కొన్నిటితో వ్యవహరించే నిబంధనలు మాత్రమే వున్న పక్షంలో అది డబ్బు బిల్లుగా పరిగణింప బడుతుంది :—

1. ఏదైనాపన్ను విధింపు, రద్దు, రెమిషన్, మార్పులేక క్రమబద్ధం చేయబడుట;
2. డబ్బును అప్పు తీసుకొనుటను క్రమబద్ధం చేయుట లేక కేంద్రప్రభుత్వం యేదైనా హామీనిచ్చుట, లేక కేంద్ర ప్రభుత్వం చేపట్టిన లేక చేపట్టనున్న యేవైనా ఆర్థిక సంబంధమయిన బాధ్యతలవిషయంలో చట్టం సవరణ;
3. ఇండియా కన్సోలిడేటెడ్ ఫండ్ లేక అత్యవసర ఖర్చుల నిధి కస్టడీ, ఏదయినా అట్టినిధికి డబ్బు చెల్లింపు లేక దానినుంచి డబ్బు తీసుకొనుట;
4. ఇండియా కన్సోలిడేటెడ్ నిధినుంచి డబ్బు ఖర్చు.
5. ఏ ఖర్చునయినా ఇండియా కన్సోలిడేటెడ్ నిధిపై ఖర్చుగా ప్రకటించుట లేక ఏదైనా అట్టి వ్యయం మొత్తాలను హెచ్చించుట.
6. ఇండియా కన్సోలిడేటెడ్ నిధి విషయంలో కాని లేక ఇండియా పబ్లిక్ అక్కౌంటు విషయంలో కాని, డబ్బును తీసుకొనుట లేక అట్టిసొమ్ము కస్టడీ లేక యిస్యూ లేక కేంద్రం లేక రాష్ట్రాల జమాఖర్చుల ఆడిట్; లేక.
7. 1 నుంచి 6 వరకూ గల సబ్-క్లాజులలో చెప్పిన యే విషయానికయినా సంబంధించిన యేదైనా విషయము.

ఒక బిల్లులో జరిమానాలు లేక డబ్బు సంబంధమయిన యితర శిక్షలు విధించబడినా లేక లైసెన్సులకు రుసుం చెల్లించమని అడిగినా లేక చేసినపనికి రుసుం చెల్లించమని అడిగినా లేక స్థానిక ప్రయోజనాలకై ఎవరైనా స్థానికాధికారి లేక సంస్థచే యేవైనా పన్నుల విధింపు, రద్దు, రెమిషన్, మార్పు లేక క్రమబద్ధం చేయుటకు వసతి కల్పించబడినా అంతమాత్రం చేత అది డబ్బు బిల్లుగా పరిగణింప బడదు. ఒక బిల్లు డబ్బు బిల్లు అవునాకాదా అన్న ప్రశ్న వుత్పన్నమయితే దానిపై లోకసభ అధ్యక్షుని నిర్ణయం తుది నిర్ణయం కాగలదు. డబ్బు బిల్లులు రాజ్యసభకు పంపబడినప్పుడు, ఆమోదానికై అవి రాష్ట్రపతికి సమర్పించబడి నప్పుడు కూడా వాటిలో అవి డబ్బు బిల్లులు అని లోకసభ అధ్యక్షునిచే సంతకం చేయబడిన సర్టిఫికెట్లు వుండాలి. రాజ్యసభ డబ్బు బిల్లును నిరాకరించలేదు, కాని అది అందిన 14 రోజుల లోపల తన సిఫార్సులతో దానిని తిరిగి పంపవచ్చు. ఆ సిఫార్సులను లోకసభ ఆమోదిస్తే ఆమోదించవచ్చు లేకపోతే లేదు. లోకసభ రాజ్యసభ సిఫార్సులలో వేటినయినా ఆమోదించి నట్లయితే ఆ డబ్బు బిల్లు రాజ్యసభచే చేయబడి లోకసభచే ఆమోదించ బడిన సవరణలతో వుభయ సభలచేత ఆమోదించబడినట్లు పరిగణింప బడుతుంది. లోకసభ రాజ్యసభ సిఫార్సులలో వేటినీ ఆమోదించకపోతే, ఆ డబ్బు బిల్లు రాజ్యసభ చేసిన సిఫార్సులు యేమీ లేకుండా లోకసభ పంపిన రూపంలోనే వుభయ సభలు ఆమోదించినట్లు పరిగణింప బడుతుంది. లోకసభ ఆమోదించిన డబ్బు బిల్లు రాజ్యసభకి పంపబడి అది పైచెప్పిన 14 రోజుల లోపల తిరిగి పంపబడక పోతే, ఆ గడువుదాటిన పిమ్మట లోకసభ

ఆమోదించిన రూపంలోనే ఉభయ సభలు ఆమోదించినట్లు పరిగణింప బడుతుంది.

## ఆర్థిక విషయాలు

రాష్ట్రపతి మాటమీద యేటేటా పార్లమెంటుకి సమర్పించబడే బడ్జెటులో రెండు భాగాలుంటాయి. కార్య నిర్వాహక వర్గం నడవడికను గురించి పార్లమెంటు సభ్యులు విమర్శించుటకు వీలుగా మొదటి భాగంపై చర్చకుమాత్రం అవకాశ మివ్వబడుతుంది; దానిపై పార్లమెంటు ఓటు చేయుటకు అవకాశం లేదు. భారత రాజ్యాంగంచే కాని పార్లమెంటు శాసనం ద్వారా కాని ఇండియా కన్సోలిడేటెడ్ నిధిపై విధించబడే ఖర్చుకి సంబంధించి వుంటుంది అది. దిగువఖర్చు ఇండియా కన్సోలిడేటెడ్ నిధినుంచి జరిగే ఖర్చు కాగలదు:

1 అధ్యక్షుని జీతభత్యాలు ఆయన ఆఫీసుకి సంబంధించిన యితర ఖర్చు.

2 రాజ్యసభ అధ్యక్ష ఉపాధ్యక్షులు, లోకసభ అధ్యక్ష ఉపాధ్యక్షుల జీతభత్యాలు;

3 వడ్డీతోసహా కేంద్రప్రభుత్వం బాకీవున్న అప్పు ఛార్జీలు, సింకింగ్ ఫండు ఛార్జీలు, రిడంప్షన్ ఛార్జీలు, అప్పు తీసుకొనుటకు సంబంధించిన యితర ఖర్చు, సర్వీసు, అప్పు రిడంప్షన్;

4 (i) సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు లేక వారి విషయంలో చెల్లించవలసిన జీత భత్యాలు, పెన్షన్లు.

(ii) ఫెడరల్ కోర్టు న్యాయమూర్తులకు లేక వారి విషయంలో చెల్లించవలసిన పెన్షన్లు;

(iii) ఇండియా భూభాగంలో చేర్చబడిన యే ప్రదేశానికయినా సంబంధించి అధికారం గల లేక యీ రాజ్యాంగం అమలుకి ముందు యెప్పుడయినా ఇండియా డొమినియన్‌లో గవర్నరు ప్రావిన్సులో చేర్చబడిన యే ప్రాంతానికి సంబంధించి అయినా అధికారాన్ని కలిగివున్న యేదైనా హైకోర్టు న్యాయమూర్తులకు లేక వారి విషయంలో చెల్లించవలసిన పెన్షన్లు;

5 ఇండియా కంప్ట్రోలరు, ఆడిటర్ జనరల్ కి లేక వారి సందర్భంలో చెల్లించవలసిన జీతభత్యాలు;

6 ఏదైనా కోర్టు లేక ఆర్బిట్రల్ ట్రిబ్యునల్ తీర్పు, డిక్రీ లేక అవార్డును సంతృప్తిపరచుట కవసరమయిన సొమ్ము;

7 అలాఛార్జి చేయబడాలని రాజ్యాంగం లేక పార్లమెంటుచే శాసనరీత్యా ప్రకటింపబడిన మరే ఖర్చు అయినా.

కన్సోలిడేటెడ్ నిధినుంచి కొత్తఖర్చునుతలపెట్టే బిల్లులు రాష్ట్రపతి సిఫార్సులేనిదే ప్రవేశపెట్టబడలేవు

బడ్జెటు రెండవభాగంలో వివిధ పద్దులక్రింద కాగలఖర్చును ఆమోదించమని అడగబడుతుంది. లోకసభ ఆఖర్చును ఆమోదించవచ్చు, తగ్గించవచ్చు లేక ఆఖరికి నిరాకరించవచ్చుకూడా, కాని యెక్కువ మాత్రం చేయలేదు. ఖర్చు తగ్గింపుకి ప్రవేశపెట్టే తీర్మానాలు కార్యనిర్వాహకవర్గం నడవడికనుగురించి చర్చించుటకై ఉద్దేశించ బడ్డాయి. కన్సోలిడేటెడ్ నిధినుంచి సొమ్ము చెల్లింపుకి అధికారం పొందుటకు అవసరమైన వార్షిక అప్రోప్రియేషన్ బిల్లు ప్రవేశ పెట్టబడి నప్పుడు బడ్జెట్ తీర్మానాలకు సభవారు కట్టుబడివుండాలి. సంవత్సరంలో సప్లిమెంటరీగ్రాంటులను అడగవలసివచ్చినాలేక బడ్జెటు ఆమోదానికి పూర్వం ఖర్చుకై ప్రత్యేకగ్రాంటును అడగవలసి వచ్చినా లేక అస్వాభావికమయినగ్రాంటును అడగవలసివచ్చినా అదేపద్ధతి అవలంబించ బడాలి.

ప్రతి రాష్ట్రానికి ఒక లెజస్లేచర్ వుంటుంది. అందులో గవర్నరు, (1) కొన్నిరాష్ట్రాలలో రెండు శాసనసభలు (2) మరికొన్ని రాష్ట్రాలలో ఒకశాసన సభవుంటాయి.

ఒకరాష్ట్రంలో రెండుసభలుగల సందర్భంలో ఒకటి శాసనమండలిఅని మరొకటి శాసనసభ అని

వ్యవహరించ బడతాయి. ఒకే ఒకసభ వున్న ప్పుడు దానిని శాసనసభ అంటారు. శాసనసభ మొత్తంసభ్యులలో అధికసంఖ్యా కులచేతను, సమావేశానికి హాజరయి ఓటింగులో పాల్గొనే వారిలో మూడింట రెండువంతులచేతను ఆమోదింపబడిన తీర్మానం ద్వారా పార్లమెంటు శాసనమండలి వున్న రాష్ట్రంలో దానిని రద్దుచేయ వచ్చు లేనిరాష్ట్రంలో దానిని యేర్పాటుచేయవచ్చు. దీని అమలుకు, దీనిఫలితంగా యేర్పడే విషయాల అమలుకు శాసనం చేయుటకై రాజ్యాంగాన్ని సవ రించుటకు అవసరమైన ప్రత్యేక పద్ధతిని అవలంబించ నవసరంలేదు. శాసనమండలిలో 40 మంది సభ్యులకు తక్కువ వుండరాదు. దానికిలోబడి, వారు ఆరాష్ట్ర శాసనసభ మొత్తం సభ్యులసంఖ్యలో మూడవవంతుకి మించరాదు. శాసనమండలిసభ్యులలో మూడవవంతు పురపాలక సంఘాలు, జిల్లాబోర్డుల సభ్యుల చేతను, 12 వ వంతు విశ్వవిద్యాలయ పట్టభద్రుల చేతను, 12 వ వంతు సెకండరీ పాఠశాలలు లేక వున్నత విద్యాసంస్థల వుపాధ్యాయుల చేతను యెన్నుకోబడాలి; ఈ అభ్యర్థులందరూ టెరిటోరి యల్ నియోజకవర్గాలకై యెన్నుకోబడాలి. మూడవవంతు సభ్యులు శాసనసభచే తనసభ్యులు కాని వారినుంచి యెన్నుకొనబడాలి. ఎన్నికలన్నీ సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటుతో సంబంధ సామ్య ప్రాతినిధ్యంపై జరగాలి. మిగిలిన 6 వ వంతు సభ్యులు గవర్నరుచే నియమింపబడాలి. వారు సార స్వతం, విజ్ఞానశాస్త్రం, కళలు, సహకారోద్యమం, సాంఘిక సేవలవంటి విషయాలలో ప్రత్యేక పరిజ్ఞానం లేక ప్రత్యక్షానుభవం కలవారై వుండాలి. రాష్ట్ర శాసనమండలి రద్దుకాదు, కాని ఆ విషయంలో పార్లమెంటుచేసిన లెజిస్లేటివ్ నిబంధనల ప్రకారం ప్రతి రెండవసంవత్సరం పూర్తయిన పిమ్మట యెంతత్వరగా వీలయితే అంతత్వరగా సాధ్యమయి నంతదగ్గరగా దాని సభ్యులలో మూడవవంతు విర మించాలి.

ప్రతిరాష్ట్రంలోను శాసనసభ సభ్యులసంఖ్య 500కి మించకుండాను, 60 కి తగ్గకుండాను వుండాలి; సభ్యులు రాష్ట్రంలోని టెరిటోరియల్ నియోజక వర్గాలనుంచి సరాసరి యెన్నిక కావాలి. ఒక రాష్ట్రంలో నియోజకవర్గాల జనాభా, వాటికి కేటా యించబడినస్థానాల నిష్పత్తి ఆచరణ సాధ్యమయి నంతవరకు ఒకేలా వుండేటట్లు నియోజక వర్గాలను యేర్పరచాలి. మామూలుగా శాసనసభ లోకసభ వలెనే 5 సంవత్సరాలు పనిచేస్తుంది. రాష్ట్ర శాసన సభల సభ్యులు భారతీయపౌరులై వుండాలి. శాసన మండలి సభ్యులవయస్సు కనీసం 30 సంవత్సరా లయినా వుండాలి. శాసనసభ సభ్యులవయస్సు 25 సంవత్సరాలకు లోబడకూడదు. ఆ సందర్భంలో పార్లమెంటుచే లేక పార్లమెంటుచే చేయబడిన యేదైనా శాసనంలో నిర్ణయించబడిన యితర అర్హ తలుకూడా వారికి వుండాలి.

రాష్ట్ర శాసనసభను సమావేశపరచుట, దాని పదవీకాలం, దాని అధ్యక్ష వుపాధ్యక్షులు, శాసన మండలి అధ్యక్ష వుపాధ్యక్షులఎన్నిక, వ్యవహార నిర్వహణ, లెజిస్లేటివ్ ప్రొసీజరు, ఆర్థికవ్యవహారాలు, డబ్బు బిల్లులవిషయంలో ప్రొసీజరు, కార్యవిధానాన్ని (ప్రొసీజరు) క్రమబద్ధంచేసేహక్కు, అనర్హత, సభ్యుల విశేషహక్కులు, రక్షణలు మున్నగువిషయాలన్నీ, దిగువపేర్కొన్న తేడాలకు లోబడి, దాదాపు పార్ల మెంటుకి సంబంధించిన విషయాలవంటివే.

గవర్నరు, ఎన్నికల కమిషన్ అభిప్రాయాలనను సరించి సభ్యుల అనర్హతలను నిర్ణయిస్తారు. అత్యవసర పరిస్థితి ప్రకటన కొనసాగునప్పుడు పార్లమెంటు తన పదవీకాలాన్ని పొడిగించుకోవచ్చు, కాని అదే పరి స్థితులలో రాష్ట్ర లెజిస్లేచర్ మామూలు 5 సంవత్స రాలకంటె యెక్కువకాలం పనిచేయాలంటే పార్ల మెంటుశాసనం అవసరం.

పార్లమెంటు వుభయసభలకు మధ్యయేర్పడిన ప్రతిష్టంభన సమష్టి సమావేశంద్వారా పరిష్కారం కావాలన్న నిబంధన శాసనమండలులుగల రాష్ట్ర లెజిస్లేచర్లకు వర్తించదు, కాని యెగువసభ ఆలస్యం చేసే అధికారం చాల తగ్గిపోయినప్పటికీ డబ్బు బిల్లులుకాని బిల్లులకు సంబంధించిన 1911 బ్రిటిష్‌పార్ల మెంటుచట్టం సూత్రం అవలంబింప బడుతుంది. శాసనసభ ఆమోదించినబిల్లును శాసనమండలి త్రోసి

పుచ్చినా, లేక బిల్లు ఆమోదింపబడకుండా మూడు నెలలుపైగా గడచిపోయినా, లేక శాసన మండలి శాసనసభ ఆమోదించని సవరణలను చేసినా శాసనసభ ఆబిల్లును అదే సమావేశంలో కాని లేక, ఆ తరువాతి సమావేశంలో కాని మళ్లీ ఆమోదించి దానిని మళ్లీ శాసనమండలికి పంపవచ్చు. శాసనమండలి ఆ బిల్లును మళ్లీ త్రోసిపుచ్చితే, లేక శాసనసభ ఆమోదించని సవరణలతో ఆమోదిస్తే, లేక బిల్లు ఆమోదింపబడకుండా ఒక నెలకిపైగా గడచిపోతే ఆ బిల్లు వుభయసభల ఆమోదాన్ని పొందినట్లు పరిగణింపబడుతుంది.

ఒక బిల్లును గవర్నరు రాష్ట్రపతి పరిశీలనకై నిలిపి వుంచితే, రాష్ట్రపతి దానిని ఆమోదించవచ్చు లేదా వీటో చేయవచ్చు. ఒక బిల్లు డబ్బుబిల్లు కాకపోతే కొన్ని సవరణలతో ఆయన దానిని తిరిగి పంపవచ్చు, కాని అప్పుడు రాష్ట్ర లెజిస్లేచర్ రాష్ట్రపతి వీటో అధికారాన్ని, గవర్నరు అట్టి పద్ధతిని అవలంబించి నప్పుడువలె, కాదనలేదు. రాష్ట్ర లెజిస్లేచర్ ఆ బిల్లును ఆరునెలలలోపల పునః పరిశీలించాలి, అది సవరింపబడినా మానినా పరిశీలనార్థం రాష్ట్రపతికి తిరిగి పంపబడాలి.

కొన్ని సందర్భాలలో బిల్లులు రాష్ట్రపతి పరిశీల నకై వుంచబడాలి. ఆస్తి హక్కులను స్వాధీనం చేసుకునే బిల్లు రాష్ట్ర లెజిస్లేచర్ చే ఆమోదింపబడినా రాష్ట్రపతి పరిశీలనకై వుంచబడి ఆయన ఆమోదం పొందనిదే శాసనం కాజాలదు. దామోదర్ వ్యాలీ కార్పొరేషన్‌వంటి అంతరరాష్ట్రనది లేక నదీలోయ అభివృద్ధి అథారిటీ అధ్వర్యంక్రిందగల నీరు లేక విద్యుచ్ఛక్తిపై పన్ను విధించే బిల్లుకూడా రాష్ట్రపతి పరిశీలనకై వుంచబడాలి. హైకోర్టు అధికారాలను తగ్గించి రాజ్యాంగంలో దానికివ్వబడిన స్థానాన్ని పోగొట్టగలదని గవర్నరు అభిప్రాయపడిన బిల్లు కూడా వుదాహరణకు, హైకోర్టు అధికారానికి ఆవల ప్రత్యేక ట్రిబ్యునల్సును యేర్పాటు చేసేబిల్లు-రాష్ట్ర పతి పరిశీలనకు వుంచబడాలి.

ఒక రాష్ట్రంలో వ్యాపారస్వేచ్ఛపై నిర్బంధా లను విధించే బిల్లులను, అట్టి నిర్బంధానికి వసతి కల్పించే సవరణలను రాష్ట్రపతిముందు అనుమతిలేనిదే రాష్ట్ర లెజిస్లేచర్ లో ప్రవేశపెట్టరాదు, ప్రతిపాదించ రాదు. భాషకు సంబంధించిన పార్లమెంటరీ బిల్లుకి కూడా రాష్ట్రపతిముందు అనుమతి కావాలి

దిగువ సందర్భాలలో గవర్నరు సిఫార్సు అవసరం:

1. డబ్బు బిల్లులు.

2. చట్టమయి అమలుపరచబడితే రాష్ట్ర కన్సోలి డేటెడ్ నిధినుంచి డబ్బు ఖర్చయే బిల్లులు.

## III లెజిస్లేటివ్ అధికారాల పంపిణీ

రాజ్యాంగ నిబంధనలకు లోబడి పార్లమెంటు ఇండియా భూభాగానికంతకీకాని కొంతకుకాని వర్తించే శాసనాలను, రాష్ట్ర లెజిస్లేచరు రాష్ట్రాని కంతకీకాని కొంతకిమాత్రమేకాని వర్తించే శాసనా లను చేయవచ్చు. ఎక్స్ట్రా టెరిటోరియల్ ఆపరేషన్ కలిగివుండగలదనే కారణంచేత పార్లమెంటు చేసిన శాసనమేదీ చెల్లనిదిగా పరిగణింపబడదు. 7వ షెడ్యూ లు I జాబితాలో అనగా కేంద్ర జాబితాలో పేర్కొనబడ్డ విషయాలలో దేనిగురించయినా శాసనం చేసే అధికారం పార్లమెంటుకు వుంది. 7వ షెడ్యూ లు II జాబితాలో అనగా రాష్ట్ర జాబితాలో పేర్కొనబడ్డ విషయాలలో దేనిగురించయినా రాష్ట్రానికంతకి కాని కొంతకికాని వర్తించే శాస నాలు చేసే అధికారం యే రాష్ట్రానికయినా వుంది. 7వ షెడ్యూలు III జాబితాలో అనగా కన్కరెంటు జాబితాలో పేర్కొనబడ్డ విషయాలలో దేనిగురించ యినా శాసనాలుచేసే అధికారం పార్లమెంటుకి, రాష్ట్రలెజిస్లేచర్లకి కూడావుంది. ఒక రాష్ట్రంలో చేర్చబడని ఇండియా భూభాగంలో యే ప్రాంతాని కయినా సంబంధించిన యే విషయంలోనయినా, అది రాష్ట్రజాబితాలోని విషయ మయినప్పటికీ, శాస నాలు చేసేఅధికారం పార్లమెంటుకి వుంది. కన్క రెంటుజాబితా లేకరాష్ట్రజాబితాలో పేర్కొనబడని యేవిషయంలో నయినా యేశాసనమయినా చేసే అధికారంకూడా దానికివుంది. అట్టి అధికారంలో యేదైనా శాసనంచేసే అధికారం, ఆజాబి తాలలో దేనిలోనూ పేర్కొనబడని పన్ను విధించే అధికారం కలసిఉన్నాయి. తానుచేసిన శాసనాలు లేక కేంద్రజాబితాలో పేర్కొనబడ్డ విషయానికి సంబంధించి అదివరకేవున్న శాసనాలు బాగా నిర్వ

హింపబడుటకై అది శాసనంద్వారా అదనపు కోర్టుల యేర్పాటుకి వసతి కల్పించవచ్చు. రాజ్యసభ తీర్మానం ద్వారా ప్రకటించినట్లయితే, రాష్ట్రజాబితా లోని విషయానికి సంబంధించి జాతీయ శ్రేయస్సు దృష్ట్యా పార్లమెంటు శాసనం చేయవచ్చు. రాజ్యసభ తీర్మానాన్ని హాజరై ఓటింగులో పాల్గొనేదాని సభ్యులలో మూడింట రెండువంతులమందికి తక్కువ కాకుండా బలపరచాలి. అత్యవసర పరిస్థితి ప్రకటన అమలులో వున్నట్లయితే, రాష్ట్ర జాబితాలోని యేవిషయానికి సంబంధించయినా శాసనం చేయుటకు పార్లమెంటుకి అధికారంవుంది. రాజ్యాంగం క్రింద అధికారంపొందిన యే శాసనాన్ని అయినా చేయుటకు ఒక రాష్ట్రలెజిస్లేచర్ కి గల అధికారానికి పై రెండు నిబంధనలు అడ్డురావు, కానిరాష్ట్ర లెజిస్లేచర్ చేసిన శాసనంలోని యేనిబంధనఅయినా, పైచెప్పిన నిబంధనల క్రింద పార్లమెంటుచే చేయబడిన శాసనంలోని యే నిబంధనకయినా ప్రతికూలగావుంటె, పార్లమెంటుచేసిన శాసనం, అది రాష్ట్రలెజిస్లేచర్ శాసనంకంటె ముందువెనుకల యెప్పుడు చేయబడినా, అమలులో వుంటుంది; రాష్ట్రలెజిస్లేచర్ చేసినశాసనం, పార్లమెంటు శాసనానికి ప్రతికూలంగా వున్నమేరకు అది అమలులోనున్నంత కాలంమాత్రం అమలుజరగదు. రెండు లేక అంతకంటె యెక్కువరాష్ట్రాలకి (వాటిసమ్మతితో) శాసనంచేసే అధికారం పార్లమెంటుకివుంది. అట్టి శాసనాన్ని మరేరాష్ట్రమయినా అవలంబించవచ్చు. పార్లమెంటు అలాచేసిన యే చట్టాన్నయినా పార్లమెంటు ఆమోదించిన లేకఅలా అవలంబించబడిన చట్టంద్వారా సవరించాలి లేక రద్దు చేయాలి, కాని ఆచట్టాన్ని అందుప సంబంధించిన రాష్ట్రలెజిస్లేచర్ సవరించుటకుకాని రద్దుచేయుటకు కాని వీలులేదు. ఇతరదేశము లేక దేశాలతో చేసుకున్నసంధి, ఒప్పందములేక కన్వెన్షనని లేక యేదైనా అంతర్జాతీయ మహాసభ మున్నగు వాటిలో తీసుకున్న నిర్ణయాన్ని అమలుపరచుటకై ఇండియా భూభాగమంతటికీకాని కొంతభాగానికి కాని వర్తించే శాసనం చేయుటకుకూడా పార్లమెంటుకి అధికారముంది. ఒకరాష్ట్రం లెజిస్లేచర్ చేసినశాసనం నిబంధన యేదైనాపార్లమెంటు చేయుటకు అధికారంవుండి పార్లమెంటుచే చేయబడినశాసనం లోని యేనిబంధనకయినా కాని కన్కరెంటుజాబితాలో పేర్కొనబడిన విషయాలలో ఒకదానికి సంబంధించి అదివరకే అమలులోఉన్న శాసనంలోని యేదైనా నిబంధనకు కాని ప్రతికూలంగా వుంటె, అప్పుడు, 254 వ. సూత్రం (2) వ క్లాజు నిబంధనలకి లోబడి, పార్లమెంటు చేసిన శాసనం, అట్టి రాష్ట్ర లెజిస్లేచర్ చేసిన శాసనం లేక సందర్భాన్ని బట్టి అదివరకే అమలులోనున్న శాసనం కంటె ముందు వెనుకల యెప్పుడు చేయబడినా, అమలులో వుంటుంది; రాష్ట్ర లెజిస్లేచర్ చేసిన శాసనం ప్రతికూలత మేరకి చెల్లదు. కన్కరెంటు జాబితాలో పేర్కొనబడ్డ విషయాలలో ఒకదాని సందర్భంలో రాష్ట్ర లెజిస్లేచర్ చేసిన శాసనం, పార్లమెంటు అంతకు ముందు చేసిన శాసనం లేక ఆ విషయంలో అంతకు ముందుగల శాసనం నిబంధనలకు ప్రతికూలంగా వుంటె, అప్పుడు, రాష్ట్ర లెజిస్లేచర్ చే అలా చేయబడిన శాసనం, అది రాష్ట్రపతి పరిశీలనకు పంపబడి, ఆయన ఆమోదాన్ని పొందితే; ఆ రాష్ట్రంలో అమలులో వుంటుంది. అయితే, యీ నిబంధనలవల్ల, యెప్పుడయినా, అదే విషయంలో, ఆ రాష్ట్ర లెజిస్లేచర్ చే అలా చేయబడిన శాసనానికి చేర్పు, సవరణ, మార్పు, రద్దులతో సహా యేదైనా శాసనం చేయుటకు పార్లమెంటుకు గల అధికారానికి భంగం కలుగదు.

రాజ్యాంగం క్రింద అవసరమయిన సిఫార్సులు, ముందు అనుమతులు కార్య విధానానికి సంబంధించిన విషయాలుగా మాత్రమే పరిగణింప బడాలి; పార్లమెంటు లేక రాష్ట్ర లెజిస్లేచర్ చేసిన చట్టం, అట్టి చట్టం నిబంధనలు, రాజ్యాంగం కోరే యేదో సిఫార్సు లేక ముందు సమ్మతి లభించనంత మాత్రాన-ఆ చట్టానికి దిగువ వారి సమ్మతి లభించినట్లయితే, చెల్లకుండా పోవు :

1. గవర్నరు సిఫార్సు అవసరమయినచోట గవర్నరు లేక రాష్ట్రపతి;
2. రాష్ట్రపతి సిఫార్సులేక ముందు సమ్మతి అవసరమయినచోట రాష్ట్రపతి.

# వ్యవసాయంలో కనీస వేతనాలు

1948 సంవత్సరపు కనీస వేతనాల చట్టం (1948 సం పు 11వ చట్టం) 1948 మార్చి 15వ తేదీన అమల్లోకి వచ్చింది. కార్మికులు సంఘటితంగాలేని కొన్ని పరిశ్రమలలో పనిచేసేవారికి నెలసరిగా గానీ, రోజువారీగా గానీ కనీస వేతనాలు లభించునట్లు చేయడమే యీ చట్టంయొక్క ఉద్దేశం. యిందు కొరకు షెడ్యూలు దాఖలా పరిశ్రమలు రెండు విభాగాలు చేయబడినవి. షెడ్యూలులో మొదటి భాగం పరిశ్రమలకు, రెండవభాగం వ్యవసాయానికీ సంబంధించినది. ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ప్రభుత్వం నిర్ణయించిన కనీసవేతనాలు షెడ్యూలు ప్రథమ భాగంలో పేర్కొన్న పరిశ్రమలన్నిటికీ—ఒక లక్క పరిశ్రమ తప్ప— యిప్పుడు ఆంధ్రప్రాంతంలో అమలు జరుపబడుతున్నవి. తెలంగాణా ప్రాంతంలో బియ్యం మిల్లులు, పిండిమరలు, బీడిపరిశ్రమ, పొగాకు, నూనె మిల్లులు, రోడ్లనిర్మాణము, మరమ్మతులు, యిండ్లు కట్టటం, రాళ్ళు పగులగొట్టటం మొదలగు పరిశ్రమ లలో— పూర్వ హైదరాబాద్ ప్రభుత్వం నిర్ణయించిన రేట్లు అమలు జరుగుతున్నవి.

భారతదేశం విశాలమైనది. ఇచ్చటి వ్యవసాయం, వ్యవసాయ కూలీల సమస్యలు క్లిష్టమైనవి. ఒకే జిల్లాలో లేదా ఒకే తాలూకాలోనే కాక ఒకే గ్రామంలో పనిచేసే వ్యవసాయ కూలీలపని నిబంధనలు కూడా భిన్నంగా వుంటాయి. మద్రాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారు, 46 జనాభా లెక్కల్లో "తక్కువ వేతనం లభించే స్థలాలు" గా పరిగణించబడిన 425 గ్రామాల్లో 84 గ్రామాలవరకే తన విచారణ పరిమితమైనట్లు తన నివేదికలో పేర్కొన్నాడు. ఈ 84 గ్రామాల్లో (15 గ్రామాలు మాత్రమే సర్వేచేయబడినవి) 2 గ్రామాలు చిత్తూరు జిల్లాలో, 4 తూర్పు గోదావరిలో, 2 విశాఖ పట్నంలో, 3 శ్రీకాకుళంలో వున్నవి. పూర్వ ఆంధ్ర ప్రభుత్వం, ఆర్థిక సలహాదారు నివేదికను జాగ్రత్తగా పరిశీలించిన తరువాత, ఆంధ్రలో 14 గ్రామాల్లో ప్రయోగచర్యగా వేతనాల కనీస ధరలను నిర్ణయించింది. ఈ చర్య, (ప్రకటన పద్ధతిలో) 29-12-54 తేదీ పరిశ్రమలు, సహకారం, కార్మిక శాఖల 2309వ సంఖ్యగల జి. ఓ. యం. ఎస్. ద్వారా గైకొనబడింది. ఈ 14 గ్రామాల్లో పనిచేసే వ్యవసాయ కూలీలకు ఈచట్టాన్ని వర్తింపజేసేపని రెవెన్యూ బోర్డుకు అప్పగించబడింది. ఈ 14 గ్రామాలు ఇవి:

1 ఓగూరు; తాలూకా కందుకూరు జిల్లా నెల్లూరు
2 గుడ్లూరు, ,, ,, ,, ,,
3 కావలి; ,, కావలి; ,, ,,
4 నాగినేనిగుంట; ,, ఉదయగిరి; ,, ,,
5 చిట్టెచర్ల; ,, వాయల్పాడు; ,, చిత్తూరు
6 కమ్మళ్ల; ,, ,, ,, ,,
7 వెలగలపాలెం; ,, గూడెంపజెన్సీ; ,, విశాఖపట్నం
8 బుదరిసింగి; ,, సోంపేట; ,, శ్రీకాకుళం
9 బంజ యువ రాజపురం; ,, ,, ,, ,,
10 కొట్టు; ,, పార్వతీపురం, ,, శ్రీకాకుళం
11 వెంకటాపురం; ,, నుగురు; ,, తూర్పు గోదావరి
12 అరుణాచలపురం ,, ,, ,, ,,
13 సి. కత్తిగూడెం; ,, ,, ,, ,,
14 ధర్మవరం; ,, పిఠాపురం; ,, ,,

ఈచట్టాన్ని సర్వంగా అమలు పరచుటకు పూర్వ ఆంధ్ర ప్రభుత్వం, రెవెన్యూ ఇనస్పెక్టరు హోదాకు తక్కువకాని రెవెన్యూ అధికార్లకందరికీ ఉత్తర్వులు చేసింది.

బోర్డు నివేదిక : కనీసవేతనాల చట్టాన్ని ఇతర ప్రాంతాలకు కూడా వర్తింపజేసే విషయాన్ని ప్రభుత్వం పరిశీలించే నిమిత్తం, ఈ చట్టం ఏవిధంగా అమలు జరుగుతున్నది తెలుపుతూ ఒక సమగ్ర నివేదికను ప్రభుత్వానికి దాఖలు చేయవలసిందని రెవెన్యూ బోర్డును ప్రభుత్వం ఆదేశించింది. అదే ప్రకారం రెవెన్యూబోర్డు ప్రభుత్వానికి ఒక నివేదికను అందజేసింది. ఆ నివేదికలో దిగువ అంశాలు కలవు :—

1. పై జి. ఓ. లో పేర్కొనబడిన ప్రాంతాలలో ఈచట్టం సంతృప్తికరంగా అమలు జరిగింది.

2. ఈచట్టాన్ని ఇతర ప్రాంతాలకు విస్తరించే విషయం తరువాత పరిశీలించ బడుతుంది. దీనికి సంబంధించిన నివేదిక ప్రభుత్వానికి కొద్దికాలంలో అందజేయబడుతుంది.

3. లేబర్ కమీషనర్ అభిప్రాయాలతోనూ, 10 ఎకరాలు అంతకు మించిన భూమిగల యజమానులు తాము నియమించుకున్న వ్యవసాయ కూలీలను గురించి రిజిష్టర్లను, రికార్డులను వ్రాయునట్టు చేయాలి అని 1956 సెప్టెంబరులో బొంబాయిలో జరిగిన కేంద్ర కనీసవేతనాల సలహా సంఘం మూడవ సమావేశంలో చేయబడిన సిఫార్సులతోను రెవెన్యూబోర్డు ఏకీభవిస్తున్నది. బీహారు, మధ్యప్రదేశ్, హైదరాబాద్, రాజస్థాన్ మొదలైన కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చట్టాన్ని అమలు పరచుటలో ఇబ్బందులు కన్నట్లు తెలిపినవి. 1. పని వేళలను నిర్ణయించడం, అమలుపరచటం, వారంలో ఒకరోజు సెలవు ఇవ్వడం, 2. రిజిష్టర్లను లేదా రికార్డులను వ్రాయడం ముఖ్యమైన ఇబ్బందులుగా పేర్కొనబడినవి.

కేంద్ర కనీస వేతనాల సలహా సంఘం, రాష్ట్ర ప్రభుత్వాలు వెలిబుచ్చిన అభిప్రాయాలను అంగీకరించి, ఈ ఇబ్బందులను తొలగించడం కొరకు, 10 ఎకరాలు అంతకంటె ఎక్కువ భూమిగన్న యజమానులు రిజిష్టర్లను, రికార్డులను వ్రాయాలని సిఫార్సు చేసింది.

పూర్వ హైదరాబాదు ప్రభుత్వం, 30-12-54 తేదీ బి/13/52/175వ సం. గల ప్రకటనలో కనీస వేతనాలను నిర్ణయించి, ఈచట్టపు 5 (1) (ఎ) విభాగం క్రింద నిజామాబాదు, పర్భనీ, రాయచూర్ జిల్లాలలో ప్రయోగ చర్యగా వీటిని అమలు పరచింది. ఇందుకొరకు నిజామాబాదు జిల్లా(తెలంగాణా) కాలువలుగల మండలం, కాలువలులేని మండలం అనే రెండు మటలాల క్రింద విభజింపబడింది. మొదటి మండలంలో బాన్స్వాడ, బోధన్, నిజామాబాదు తాలూకాలు, ఆర్మూరు తాలూకాలోని కొన్ని భాగాలు చేర్చబడినవి. రెండవదానిలో కామారెడ్డి, యెల్లారెడ్డి తాలూకాలు, ఆర్మూరు తాలూకాలలోని కొన్ని భాగాలు చేర్చబడినవి. ఈ చట్టాన్ని అమలు పరచటానికి ప్రభుత్వం ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయలేదు. ఈపని ఫ్యాక్టరీలు, కార్మికశాఖల అధికార్లకు అప్పగించబడింది. కనిష్ట వేతనాల రేట్లను సవరించడానికి ఆంధ్ర ప్రభుత్వం ఇటీవల ఒక సంఘాన్ని నియమించింది. ఈవిధంగా ఆమోదించబడే కూలీరేట్లు ఆంధ్ర ప్రదేశ్ అంతటా వర్తింప జేయబడగలవు. ఈసంఘం పని ప్రారంభించి చురుగ్గా సాగిస్తున్నది.

—:0-0:—

ఆహార రంగంలో

# వృధాచేయడం మానాలి

ఆహారపదార్థాల ఉత్పత్తిస్థాయి పడిపోతున్న పరిస్థితి ఎదుర్కొనని, దేశం కష్టపడి పనిచేస్తున్న తరుణంలో పౌరులందరూ పొదుపరితనం అలవరచుకొని, వృధావ్యయం మానుకోవటం ప్రధమ కర్తవ్యం. ఈ ఉద్యమాన్ని దాదాపు యుద్ధస్థాయిలో నిర్వహించాలి. గడ్డు పరిస్థితి తొలగేవరకూ యిదే పౌరులందరి కర్తవ్యం.

ఆంధ్రప్రదేశ్ దక్షిణ భారతంలో ధాన్యాగారమని సగర్వంగా చెప్పుకోవచ్చు. కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పెన్నా నదులు యిరిగేషన్‌కు ముఖ్యమైన వనరులు. ఈ నదుల నీటిని వినియోగించుకొనుటకై, నిర్మించబడుతున్న బహుళార్థ సాధక ప్రాజెక్టుల మూలంగా త్వరలో రాష్ట్రంలోని ఆహారోత్పత్తి చాలా ఎక్కువవుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో లక్ష్యభూతమైన 16.43 లక్షల అదనపు ఆహారోత్పత్తిలో 4.68 లక్షల టన్నుల ఉత్పత్తి పెద్ద, చిన్న తరహా ప్రాజెక్టులవల్ల జరుగుతుంది.

మామూలు పరిస్థితులున్న రోజుల్లో కూడా ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రమైనందున దేశంలోని యితర రాష్ట్రాలకు ఆహారధాన్యాలు సప్లయి చేస్తుంది. దేశంలో ఏప్రాంతంలోనైనా తరుగు పరిస్థితి లేక క్షామబాధ ఏర్పడిన సమయాల్లో 'వాటికి సహాయం అందించటానికి ముందుకు వచ్చేది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే. రాష్ట్ర ద్వితీయ ప్రణాళికను నిర్మించినప్పుడు, యీ విషయాలను దృష్టిలో పెట్టుకునే రాష్ట్ర వ్యవసాయ కార్యక్రమాలకు అత్యధిక ప్రాధాన్యం యివ్వబడింది.

పెరుగుతున్న జనాభాకు తగినంత ఆహారం అందించటానికీ, అభివృద్ధి చెందుతున్న పారిశ్రామిక వ్యవస్థకు అవసరమైన ముడిపదార్థాలు అందించటానికీ, ఎగుమతులు చేయటానికి వ్యవసాయ వస్తువులు ఎక్కువగా లభించటానికీ అనువుగా ప్రణాళికలోని కార్యక్రమాలు రూపొందించబడినవి. ఈ లక్ష్యాలతోనే రాష్ట్ర ద్వితీయ ప్రణాళికలోని వ్యవసాయ పథకాలు తయారైనవి. మొత్తం రాష్ట్రంలో 150 పథకాలు— ఆంధ్రలో 81, తెలంగాణాలో 69— రు. 687.36 లక్షల ఖర్చుతో అమలు పరచబడగలవు.

అయితే రాష్ట్రంలో ప్రకృతి వైపరీత్యాలు జరిగినప్పుడు— యిటీవల శ్రీకాకుళం, విశాఖజల్లాలలో జరిగినట్లు— దక్షిణాపథ ధాన్యాగారమని ప్రసిద్ధి చెందిన యింతటి రాష్ట్రంలోకూడా దాదాపు తరుగు పరిస్థితి ఏర్పడుతుంది. అట్టి సమయాలలో తనకు తాను సరిపుచ్చుకోవటం మాట అటుంచి, యితర రాష్ట్రాలకు తాను సప్లయిచేయగల శక్తి మాత్రం తగ్గిపోతుంది.

## అఖిల భారత దృష్టితో

అఖిలభారత దృష్టితోనూ, అంతర్జాతీయ దృష్టితోనూ ఆహార సమస్య, జనాభా సమస్యలను సమీక్షించటం యిక్కడ అవసరం. అంతర్జాతీయంగా ఆహార పదార్థాల ఉత్పత్తి స్థాయి యుద్ధ కాలంలో పడిపోయి, తిరిగి మళ్ళీ యిప్పుడు కోలుకున్నప్పటికీ, యీ మధ్యకాలంలో జనాభా పెరిగినదానికి అనుగుణంగా ఉత్పత్తి పెరగలేదు. 1952 నాటికి యుద్ధాత్పూర్వ స్థాయికంటె ప్రపంచ ఆహారోత్పత్తి 8 శాతం మాత్రం పెరిగింది. జనాభా 14 శాతం పెరిగింది.

ఆహారోత్పత్తి, జనాభా పెరుగుదలను నిష్పక్షపాతంగా పరిశీలిస్తే, ఉత్తర అమెరికా, పశ్చిమ యూరప్, ఓషియానా ప్రాంతాల్లో మాత్రమే

జనాభా పెరుగుదలకు అనుగుణంగా ఆహారోత్పత్తి పెరిగింది. అయితేయూరప్‌లో ఇంగ్లండు, నెదర్లాండ్స్ డెన్మార్కు, స్విడ్జెర్‌లాండ్ మొదలగు దేశాలలో కూడా జనాభాకు తగినట్లు ఉత్పత్తి పెంచగలిగారు. తీసుకునే పదార్థాల విషయంలో కూడా మార్పులు చేసుకొన్నారు. భారతదేశంవంటి అభివృద్ధి చెందనిదేశాలు ఆహారోత్పత్తిలో వెనుక పడిపోయాయి. దానితో బాగా ఆహారం లభించే దేశాలకూ, లేని దేశాలకూమధ్య అఘాతం యింకా ఎక్కువైంది.

ఐక్యరాజ్యసమితి జనాభాలెక్కల విభాగం వారి అంచనాలనుబట్టి ప్రస్తుతం సంవత్సరానికి 1.3 శాతం వంతున జనాభా పెరుగుతోంది. అంటే ప్రతి 50, 60 సంవత్సరాల కొకసారి ప్రపంచ జనాభా రెట్టింపు అవుతుంది. జనాభా పెరగటమే కాదు, పెరుగుతున్న రేటుకూడా ఎక్కువగానేవుంది. ప్రపంచం మొత్తంమీద లెక్కవేసిచూస్తే, యిటీవల సంవత్సరాల్లోనే, జనాభానుమించి ఉత్పత్తి పెరిగింది. యఫ్. ఎ. ఒ సంస్థవారి లెక్కలనుబట్టి ఉత్పత్తి పెరిగినది అర్థంమైనా, యు. యస్. ఎ, కెనడా, ఆస్ట్రేలియా మొదలగు కొద్దిదేశాలలోనే. అంటే కొన్నిదేశాలలో మాత్రం సగటున మనిషికి 15 ఏండ్ల క్రితంకంటే యిప్పుడు ఎక్కువఆహారం లభిస్తుంది. కాని మిగిలిన అనేకదేశాలలో యుద్ధంవల్ల జరిగిన విధ్వంసన, దారిద్ర్యం, సాంఘిక రాజకీయ ఒడుదుడుకులు మొదలగు అనేక కారణాలవల్ల ఉత్పత్తి తగ్గిపోయింది.

యివే అంతర్జాతీయ పరిస్థితి. పోతే భారతదేశంలో జనాభా ఎక్కువగా పెరుగుతూవుంటే ఆహార పదార్థాల ఉత్పత్తిమాత్రం చాలా అసంతృప్తికరంగా వుంది. 1954-55 సంవత్సరపు సంఖ్యా వివరాల ననుసరించి మొత్తం మనదేశ భౌగోళిక విస్తీర్ణం 806 మిలియన్ల యకరాలకుగాను 719 మిలియన్ల యకరాలభూమి క్లాసిఫై చేయబడింది. 124 మిలియన్ల యకరాలు అడవులు. పైర్లువేసిన మొత్తం భూమి 316 మిలియన్ల యకరాలు. యిందులో 54 మిలియన్లకు అంటే 17 శాతం భూమికి అనుమానం లేకుండా ఖాయంగా సేద్యపునీరు లభిస్తుంది. మొత్తం సాగుకు లాయకైనభూమి 497 మిలియన్లు. అంటే తలసరి సగటు 1.2 యకరాలు. ఈభూమిలో అంతటా ఉత్పత్తిజరిగితే, మనజనాభా కంతకూ శాకాహారవసతి కల్పించటానికి సరిపోతుంది. కాని జనాభా పెరుగుదల సంఖ్యలనుచూస్తే, పరిస్థితిఅంత ఆశాజనకంగా లేదు.

## జనాభా పెరుగుదల

1931-41 ల మధ్యకాలంలో 14.3 శాతం, 1941-51 మధ్యకాలంలో 13.3 శాతం మన దేశంలో జనాభాపెరిగింది. ఈరెండు దశాబ్దాలలో పెరిగిన జనాభాకు అనుగుణంగా ఆహారోత్పత్తి మాత్రం పెరగలేదు. పశ్చిమదేశాలలో ఆహారోత్పత్తి జనాభా పెరుగుదలకు సరిపడ పెరిగింది. పంటలుపండే విస్తీర్ణము, వివిధ ఆహారధాన్యాల ఉత్పత్తిసంఖ్యలు పెరుగకుండా మనదేశంలోస్థిరంగా నిలబడినవి. 1951-61 మధ్యకాలంలో మనదేశంలో జనాభా 12.5 శాతం పెరుగుతుందని అంచనా వేసుకుంటే, అలాగే 1961-71 మధ్యకాలంలో 13.3 శాతం, 1971-81 మధ్యకాలంలో 14 శాతం పెరుగుతుందనుకుంటే, 1976 సంవత్సరానికి, సంఖ్యా శాస్త్ర అంచనాలప్రకారం మనజనాభా 50కోట్లు అవతుంది. అంటే 1921 నాటి జనాభాకు రెండింతలు, కాగా జనాభాకు అనుగుణంగా ఆహారోత్పత్తి పెరుగుతుందా లేదా అనేవిషయం యింకా ఊహాగానాల రూపంలోనేవుంది.

భారతదేశంలో వివిధరకాల వ్యవసాయోత్పత్తులు జరుగుతున్నప్పటికీ, సగటు దిగుబడిమాత్రం చాలా తక్కువ. 1954 సం॥పు యఫ్. ఎ. ఒ. సంస్థ అంచనాలప్రకారం, భారతదేశంలో యకరానికి గోధుమ దిగుబడి 670 పౌనులు. అదే ఈజిప్టులో 2040 పౌనులు, జపాన్‌లో 2016 పౌనులు. అదేవిధంగా భారతదేశంలో యకరంలోపండే వరికంటే 4 రెట్లు యిటలీలోనూ, 3 రెట్లు జపానులోనూ పండుతుంది. మనచెరుకు దిగుబడి జావాలో 4 వ వంతుమాత్రమే. మనదేశంలో తక్కువదిగుబడి రావటానికి ప్రధాన కారణం, అనేక యిబ్బందులవల్ల, ముఖ్యంగా దారిద్ర్యంవల్ల. శాస్త్రీయవిజ్ఞానం ప్రసాదించిన అనేక అధునాతన వ్యవసాయ పరికరాలను మనరైతులు ఉపయోగించుకోలేక పోవడమే.

## దిగుమతులు తప్పనిసరి

దిగుబడి తక్కువగా వున్నందున, ఆహార పదార్థాల్లోగానీ, వ్యాపార పంటల్లోగానీ, మన ఉత్పత్తి దేశావసరాలకు సరిపోదు. విదేశాలనుండి భారీయెత్తున ఆహార పదార్థాలను దిగుమతి చేసుకోవటం తప్పనిసరి. మనకు యిష్టంలేకపోయినా, తప్పదు. 1946 లో 2.25 మిలియన్ టన్నులు, 1949 లో 3.71 మిలియన్ టన్నులు, 1952 లో 3.90 మిలియన్ టన్నులు ఆహార ధాన్యాలు మనం దిగుమతి చేసుకున్నాం. ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలు జరిగిన తర్వాతమాత్రం పరిస్థితి పూర్తిగా బాగు కాకపోయినా, కొంతవరకు మెరుగే. ప్రథమ ప్రణాళికకాలంలో పెద్ద, చిన్నతరహా యిరిగేషన్ ప్రాజెక్టులక్రింద 6.3 మిలియన్ల యకరాలు, మైనర్ యిరిగేషన్ ప్రాజెక్టులక్రింద సుమారు 10 మిలియన్ల యకరాలు అదనంగా సాగులోకి వచ్చింది. రెండవ ప్రణాళికకాలంలో అదనంగా 21 మిలియన్ల యకరాలకు సేద్యపు నీటిపారుదల కల్పించాలని సంకల్పం. ఆహారోత్పత్తి లక్ష్యం 81 మిలియన్ టన్నులు. ఈ విధమైన అభివృద్ధి సాధిస్తున్నప్పటికీ, పెరుగుతున్న జనాభా, ప్రకృతి వైపరీత్యాలు, సేద్యపు నీటి ప్రయోజనాలను వినియోగించుకొనుటలో భారత రైతుల మందగొడితనం మొదలగు కారణాలవల్ల ఉత్పత్తిస్థాయి పెరగటంలేదు. ప్రస్తుత పరిస్థితిలో దేశంలో ఆహార రంగంలో చాలా క్లిష్టస్థితికూడా ఏర్పడింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందుకే యిటీవల అధికోత్పత్తి, రైతులకు ప్రోత్సాహం మొదలగు విషయాలమీద శ్రద్ధగా కేంద్రీకరించి పని చేస్తున్నవి. మేలురకం విత్తనాలు, ఎరువులు, రసాయనిక ఎరువులు, ఆధునిక వ్యవసాయ యాంత్రిక పరికరాల వినియోగం, శిస్తు మినహాయింపులు మొదలగు చర్యలు గైకొంటూ రైతులను ఉత్సాహపరుస్తున్నవి.

## పౌరుల కర్తవ్యం

భారతజాతి సమిష్టిగానూ, రైతులు వ్యక్తిగతంగానూ ఆహార రంగంలో యుద్ధంచేస్తున్న యీ తరుణంలో పౌరులు నిర్వహించవలసిన పాత్ర చాలా ప్రధానమైనది. ముఖ్యంగా వృధావ్యయం తగ్గించుటలో వారు తోడ్పడాలి. రిస్టారెంట్లు, హోటల్సు, మొదలగు సంస్థలలో అనేక సందర్భాలలో చాలా ఆహార పదార్థాలు వృధా అవుతాయని మనందరికీ తెలుసు. ఈ విధంగా వృధా కావటం ఒక విధమైన సంఘ వ్యతిరేక చర్యగా మనం పరిగణించాలి. ఆ దృష్టితోచూసి ఆయా సంస్థలలో ఎంతెంత అవసరమో, అంతే వాడునట్లుగా జాగ్రత్తగా కట్టుదిట్టాలు చేయాలి. ఉత్సవాలు, శుభకార్యాలు మొదలగు సందర్భాలలో పెద్ద పెద్ద విందులు మొదలగువాటిని సాధ్యమైనంతవరకు నిరుత్సాహపరచాలి. పెండ్లిండ్లు, ప్రభుత్వ కార్యక్రమాలలో వీటిని తగ్గించుకోవాలి. సాధ్యమైనంత తక్కువ మంది అతిథులను పిలుచుకునే ఏర్పాట్లు అవలంబించాలి. దేశంలో వరి పండే ప్రాంతాల్లో చాలాచోట్ల అనావృష్టి పరిస్థితులేర్పడినందున బియ్యం ఉత్పత్తి తగ్గింది. కాబట్టి, ప్రజలు బియ్యానికి బదులు గోధుమ వాడకం నేర్చుకోవాలి. బియ్యం వాడకం తగ్గించటానికే కాక, బలకరమైన ఆహార పదార్థంగా కూడా గోధుమ వాడకం మంచిది. మనం తీసుకునే ఆహార పదార్థాలలో విటమిన్లు పుష్టికరమైన యితర పదార్థాలు ఎక్కువగా వుండుటకై, ఆకుకూరలు, మంచి నీటిలో పెరిగే చేపలు, వీలైనంత ఎక్కువగా వాడుకోవాలి. కొంతకాలంవరకైనా ఆహారపు అలవాట్లు మార్చుకొని, పొదుపరితనం అలవరచుకోవటం అత్యావశ్యకం.

ఆహార పదార్థాలు, ముఖ్యంగా బియ్యం కొరత ఎక్కువవుతున్న ప్రస్తుత తరుణంలో, అనావృష్టి దోషంవల్ల ఉత్పత్తిస్థాయికూడా పడిపోయిన ప్రస్తుత కాలంలో, ఉన్న పరిస్థితులకు అనుగుణంగా తమ అలవాట్లను సర్దుకొని, దేశక్షేమందృష్ట్యా ఆలోచించి పనిచేసి, తోడ్పడవలసిన బాధ్యత మన పౌరులమీద ఉన్నది. పొదుపరితనం ఒక ఉద్యమంగా పెంపొందించుకొని వృధావ్యయాన్ని అరికట్టటమే దీనికి ఏకైకమార్గం.

—:o-o:—

# ఉభయతారకం:

"నేషనల్ సేవింగ్సు పథకంలో పెట్టిన పెట్టుబడులు వ్యక్తికి, జాతికీ కూడ లాభమే. వ్యక్తి విషయంలో డబ్బు భద్రంగా వుంటుంది, లాభకారిగా వుంటుంది. జాతి విషయంలో అభివృద్ధి ప్రణాళికలకు అవసరమైన నిధులు సమకూరుతాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సోదర ప్రజల జీవిత పరిస్థితులను అభివృద్ధి పర్చటానికి జాతీయ స్థాయిలో జరుగుతున్న ప్రయత్నం కనుక దీనిని విజయవంతం చేయుట ప్రతి దేశభక్తుని కర్తవ్యం." అని నేషనల్ సేవింగ్స్ పక్షోత్సవాల సందర్భంగా ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రంనుండి జనవరి 16వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సచార్‌గారు చేసిన ప్రారంభోత్సవ ప్రసంగంలో అన్నారు.

వారు యింకా యిలా అన్నారు. "ద్వితీయ ప్రణాళికలో చేర్చబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమైన డబ్బు సమకూర్చుకోవడం కోసం కేంద్రప్రభుత్వం నేషనల్ సేవింగ్స్ ఉద్యమాన్ని ప్రారంభించింది. ప్రణాళికలో పబ్లిక్ రంగంలో రు 4,800 కోట్లు ఖర్చు చేయాలని ఉద్దేసించిన విషయం మీకు తెలుసుకదా. ఈ డబ్బు అంతా అదనపు పన్నుల ద్వారాను మార్కెటులో ఋణం చేయడం ద్వారాను చిన్నమొత్తాల పొదుపు ఉద్యమం ద్వారాను సమకూర్చుకోవాలని సంకల్పం. ప్రణాళిక కాలం 5 సంవత్సరాలలో చిన్నమొత్తాల పొదుపు ఉద్యమము ద్వారా రు 500 కోట్లుసాధించాలని ప్రభుత్వం నిశ్చయించింది. మనరాష్ట్రానికి యీ ఆర్థిక సంవత్సరానికి రు 9.25 కోట్లు వసూలు కోటా నిర్ణయించబడింది. 3 న్నరకోట్ల జనాభాకు పైగావున్న మన రాష్ట్రంలో యీ మొత్తాన్ని పంచితే నెలకు మనిషికి సుమారు 30 నయాపైసలు ఖర్చుఅవుతుంది. మనలో చాలా దరిద్రులమైనప్పటికీ యీ మొత్తం చెల్లించటం ఏమంత కష్టంకాదు. ఇంతవరకు యీ సంవత్సరం యీ ఉద్యమంలో జరిగిన కృషి గడచిన సంవత్సరంలో కంటే ఎక్కువగానే ఉన్నది. మీ అందరి సహకారంతో యీ సంవత్సరపు వసూలు కోటా పూర్తిగా సిద్ధించగలదని ఆశించుచునున్నా. డబ్బు మిగుల్చుకోవడం వల్లకలిగే ప్రయోజనాలను గురించి మీకు నేను ప్రత్యేకం చెప్ప వలసిన పనిలేదు. ఏమనిషికైనా తనజీవితం ఎంతవరకు వున్నదో తాను ఎంత కాలం దృఢంగావుండి డబ్బు సంపాదించుకొనే శక్తిని కలిగివుంటాడో తెలియదు. అందువల్ల దూరదృష్టిగల ప్రతివాడు బవిష్యత్తులో అక్కరకు రావడంకోసం డబ్బు మిగుల్చుకుంటాడు. తన మరణానంతరం తన బంధువులు ఇబ్బంది పడకుండా ఉండటానికి తనకు నిరుద్యోగం ప్రాప్తించే యెడల ఆ సమయంలో అక్కరకు రావటానికి దాచుకొన్న డబ్బు పనికివస్తుంది. ఎంత తక్కువఆదాయం ఉన్నవారైనా కొంతలోకొంత మిగుల్చుకొనే అలవాటు మనందరికీ సహజమే. నేషనల్ సేవింగ్స్ ఉద్యమం వివిధ తరగతుల ప్రజలలో పొదుపుతనాన్ని అలవర్చి వారు దాచుకొన్న డబ్బును పదిలంగా లాభదాయకంగా పెట్టుబడిపెట్టే అవకాశాలను కల్పించటానికి ఉద్దేశించబడింది. మనం పోస్టాఫీసులలోనుండి లేక ఇందుకొరకు నియమించబడిన ఏజంట్లనుండి కొనటానికి వీలుగా అనేకరకాల నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు ఉన్నవి. అవసరంవస్తే వీటిని సులభంగా డబ్బు రూపంలోకి మార్చుకోవచ్చు. ఈసర్టిఫికెట్లలో పెట్టుబడి పెట్టితే డబ్బు భద్రంగావుంటుంది. మంచి వడ్డీకూడా గిట్టుబాటు అవుతుంది. యీవడ్డీకి ఆదాయపుపన్ను బాధలేదు. అంతేకాక దీనిలో పెట్టుబడి పెట్టినవారు జాతీయ అభివృద్ధి కార్యక్రమాలకు దోహదం చేసినవారై సంతృప్తిని పొందవచ్చు.

ఎందుకంటే యీవిధంగా సమకూడినడబ్బు దేశంలో నిర్మాణాత్మక కార్యక్రమాలను—జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు, రైల్వేలు, మొదలగురహదార్ల అభివృద్ధి, వ్యవసాయాభివృద్ధి, ఉక్కు పరిశ్రమ, ఎరువుల ఫ్యాక్టరీలు, మొదలగు అనేక కార్యక్రమాలను—నిర్వహిస్తున్న ప్రభుత్వానికి ఆర్థిక స్తోమతను పెంచుతుంది. ఏదేశంలోనైనా, లభించే పెట్టుబడిని బట్టి ఆదేశాభివృద్ధి ఆధారపడివుంటుంది. డబ్బు నిలువలను ఎంతగా పెంచుకోగలిగితే అంతగా దేశం అభివృద్ధి చెందుతుంది. ఉదాహరణకు ప్రస్తుతం అమెరికా ఇంత ఉచ్ఛస్థాయిలో వుండుటకు కారణం ఆ దేశంలోని జాతీయ ఆదాయంలో 15 శాతం వరకు పెట్టుబడి రూపంలో వుండడమే. రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో మన దేశంలోని జాతీయ ఆదాయంలో 10 శాతం వరకు పెట్టుబడి పెట్టాలని మనం సంకల్పించుకొన్నాం. పెట్టుబడి నిలువలు ఏర్పాటు చేసుకోకుండా వచ్చిన ఆదాయం అంతా ఖర్చు చేసుకునే దేశాలలో సుస్థిరమైన ఆర్థిక వ్యవస్థ యేర్పడదు. ఎప్పుడు ఆ దేశాలు దరిద్రాన్ని అనుభవిస్తూ వుంటాయి. అందువల్ల మన పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించబడిన లక్ష్యాలను సాధించాలంటే పొదుపరితనాన్ని అలవాటు చేసుకోవాలి. వృధాగా అనవసరంగా జరిగే ఖర్చులను తగ్గించుకొని మిగుల్చుకొన్నదానిని ప్రభుత్వానికి పెట్టుబడిగా అందించాలి. డబ్బు మిగుల్చుకొనే అలవాటువలన దేశంలో ధరలు పెరిగిపోకుండా ఆపవచ్చుననే విషయంకూడా గమనార్హం. తమకు వచ్చే ఆదాయమే తమ అవసరాలకు చాలనందున తాము ఏమాత్రం మిగుల్చుకొనే వీలు లేదని కొందరు వాదిస్తారు. యీ వాదన లోపభూయిష్టమైనది. ఎందుకంటే ఆదాయం ఎంత ఎక్కువగా వచ్చినా మన కోర్కెలను అన్నింటిని పూర్తిగా తీర్చలేదు. కాగా మనలో ఎవ్వరికీ కూడ మిగుల్చుకొనే అవకాశం ఉండనే ఉండదు. మామూలుగా ప్రజలు తమకు వచ్చిన ఆదాయాన్ని అంతా నిర్లక్ష్యంగా ఖర్చుచేస్తారు. ఒక్కొక్కప్పుడు వృధా కూడా చేస్తారు. డబ్బు మిగుల్చుకోవాలంటే కొన్ని కొన్ని సుఖాలను, సౌకర్యాలను త్యాగంచేయవలసి వచ్చే మాట నిజమే. కాని ముందు ముందు యీ త్యాగమే మనకు అక్కరకువస్తుంది. వార్ధక్య దశలోనూ, లేక అనారోగ్యదశలో సంభవించే యిబ్బందులను ఎదుర్కోటానికి భీమా చేసినట్లుగా యీడబ్బు ఉపయోగపడుతుంది. అంతేకాక యితరులకోసం ఒకవ్యక్తి మనఃపూర్వకంగా తన సుఖాన్ని ఎంతవరకు త్యాగం చేయగలడు అనేదానిమీదనే అతనియొక్క మంచితనం సచ్ఛీలం ఆధారపడి వుంటుంది. మనదేశ చరిత్ర అత్యున్నత స్థాయిలోగల త్యాగ దీక్షకు పేరొందినది. అట్టి దేశీయులమైన మనకు యీ త్యాగబుద్ధి సర్వసహజమైనది. నేషనల్ సేవింగ్స్ సప్తాహోత్సవాలను జరుపటంలో ప్రధానోద్దేశము పంచవర్ష ప్రణాళికల సందేశాన్ని దేశమంతటా అందించి ప్రతిపౌరుడు ఎంతతక్కువైనా సరే తనశక్తికి అనుగుణంగా దేశీయ ఆర్థికవ్యవస్థను తోడ్పడునట్లు ఉత్సాహాన్ని కల్పించటమే. ఈపక్షం రోజులలో చిన్నమొత్తాల పొదుపు ఉద్యమం విరివిగా ప్రచారం చేయబడుతుంది. దేశవ్యాప్తంగా గ్రామీణ ప్రాంతాలతోసహా ప్రతికుటుంబానికి యీసందేశం అందజేయబడుతుంది. వివిధ సేవింగ్సు పథకాలవలన ప్రజలకు జాతికికలిగే ప్రయోజనాలను గురించి ప్రతివారికి తెలిసేటట్లు ప్రచారం జరుగుతుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలోనూ ద్వితీయ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలోను జరిగిన అభివృద్ధి ప్రజలకు వివరించి తద్వారా జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో తాముకూడా పాల్గొనాలనే ఉత్సాహం వారికి కలుగచేయబడుతుంది.

కాగా యీ శుభప్రారంభ సమయంలో నేషనల్ సేవింగ్స్ ఉద్యమానికి మనస్ఫూర్తిగా సహకరించవలసినదిగా కోరుచున్నాను. తాము నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లలలో పెట్టుబడి పెట్టటమేకాక తమ స్నేహితులకు పరిచయస్తులకు యీ వుద్యమం ప్రాధాన్యతను వివరించి ప్రభుత్వంలో సహకరించవలసిన అవసరాన్ని గుర్తింపజేసి ప్రజలందరూ యీ ఉద్యమానికి తోడ్పడ వలసిందని నా విజ్ఞప్తి. ఈ ఉద్యమంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రశంసా పాత్రమైన విజయాన్ని సాధించగలదని ఆశిస్తున్నాను."

—:o-o:—

# దేశం ఆంధ్రప్రదేశ్ వైపు చూస్తోంది:

జనవరి 29వ తేదీన పటంచెరువు పంచాయతీ సమితి సమర్పించిన స్వాగతపత్రానికి సమాధానంగా మాట్లాడుతూ కేంద్ర సమాజాభివృద్ధి శాఖామాత్యులు శ్రీ యస్. కె. డే గారు, ఆంధ్రప్రదేశ్‌లో పరిపాలనా వ్యవహారాలలో ప్రజాస్వామిక వికేంద్రీకరణ సూత్రాన్ని అమలుపరుస్తూ ప్రయోగాత్మకంగా ఏర్పరచిన 20 పంచాయతీ సమితుల వైపు యావద్భారతదేశం ఆసక్తితో చూస్తూందని ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీ సమితుల స్థాపనద్వారా బలవంతరాయ్ మెహతా కమిటీ సిఫార్సులను అమలుపరుస్తూ వుండటంతమకు సంతోషదాయకంగా వుందని ఆయన పేర్కొన్నారు.

సమాజాభివృద్ధి కార్యక్రమాలలో విజయోత్సాహంతో కృషిచేస్తున్న పటంచెరువు బ్లాకుప్రజలను అభినందిస్తూ, కోళ్ళ పెంపకము, మత్స్యపరిశ్రమను కూడా పెంపొందించు కోవలసిందని శ్రీ డే ప్రజలకు సలహాయిచ్చారు.

## సుహృద్భావం

3.1.59 తేదీగల స్వరాజ్య పత్రికలో శ్రీ వి. పి సాథే తనమామూలు ఫిలింకాలంలో యీ విధంగా రాశాడు:

భారతదేశంలో విదేశీయుడెవడైనా స్వేచ్ఛగా ఫిల్ములు తీసుకోవచ్చు. భారతనిర్మాతలకు మాత్రం అనేక అవరోధాలువున్నాయి. అసలు స్వేచ్ఛయే లేదా అన్నంతగా నిర్బంధాలు వున్నాయి. "ఇన్‌సాన్ జాగ్ ఉఠా" అనే చిత్రంతీస్తున్న శక్తిసమంత భక్రా-నంగల్ ఆనకట్టవద్ద కొన్నిదృశ్యాలు షూట్ చేయాలని కోరాడు. కాని ఆయనకు అనుమతిలభించలేదు. పంజాబు ప్రభుత్వమేకాదు, బొంబాయితోసహా అన్నిరాష్ట్రప్రభుత్వాలు, కొత్తగానిర్మించే ఆనకట్టల వద్ద దృశ్యాలు తీసుకోటానికీ ఆయనకు అనుమతి యివ్వలేదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఒక్కటే అనుమతించింది. ప్రస్తుతం నిర్మాత లంబాడ హైదరాబాద్ పరుగెత్తుకు పోతున్నారు. ఎందుకంటె ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే ముఖ్యమైన అవుట్ డోర్ దృశ్యాలు తీసుకోవడానికి సౌకర్యాలు లభిస్తున్నవి. యితర ప్రభుత్వాలన్నీ ఆనకట్ట స్థలంవద్ద షూటింగ్ నిషేధించబడినదనే నాకుతో అనుమతి నిరాకరిస్తున్నవి. ఈనిషేధంవల్ల పంచవర్ష ప్రణాళికకు చిత్రాలద్వారా అధిక ప్రచారం కలుగజేసే అవకాశం లేకుండా పోతున్నది.

## మురికి పేటల నిర్మూలన పథకాలు

సికింద్రాబాద్‌లో జనవరి 13వ తేదీన బన్సీలాల్ మోతీలాల్ ధర్మసంస్థ కౌలుదార్ల సంఘంవారు చేసిన సన్మానసభలో ప్రసంగిస్తూ కేంద్ర ప్రభుత్వ గృహ నిర్మాణశాఖామాత్యులు శ్రీ కె. సి. రెడ్డిగారు హైదరాబాద్‌లోని మురికిపేటల నిర్మూలన పథకాలను ప్రశంసించారు. ఈ విషయంలో యింకా చేయవలసింది చాలా వున్నదని ఆయన పేర్కొన్నారు. గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణాలలోనూ స్వయంకృషిమీద ఆధారపడిన అనేక గృహనిర్మాణ పథకాలను గురించి వివరాలు పేర్కొని, వీటిని రాష్ట్రప్రభుత్వాలు అమలుపరచగలవన్నారు. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల నిధులను కేటాయిస్తుంది. పథకాలను మంజూరుచేసి డబ్బు యిచ్చే బాధ్యతకూడా ఒప్పగించబడుతుంది. ద్వితీయ ప్రణాళికలో యీ పథకాలకుగాను ఆంధ్రప్రదేశ్‌కు రు. 7 కోట్లు కేటాయించబడిందని శ్రీ డే గారు ప్రకటించారు.

## అనారోగ్యం తక్కువ

కేంద్ర ఆహార శాఖామాత్యులు శ్రీ డి. పి. కర్మార్కర్ గారు డిశెంబరు 27 వ తేదీన విశాఖ పట్టణంలోని కింగ్ జార్జి ఆస్పత్రిలో అవుట్ పేషంట్ విభాగానికి కొత్తగా ఏర్పాటుచేసిన విస్తరణ భవనాలకు శంకుస్థాపనచేస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వివిధ రంగాలలో సాధించిన అభివృద్ధిని పేర్కొని ప్రభుత్వాన్ని అభినందించారు. యితర ఏ రాష్ట్రంలో కంటే గూడా ఆంధ్రప్రదేశ్ లో అనారోగ్యం చాలా తక్కువని ఆయన సూచించారు. ఆంధ్ర వైద్య కళాశాల, కింగ్ జార్జి ఆస్పత్రి విషయాలలో జరుగుతున్న అభివృద్ధిగమనాన్ని ఆయన మెచ్చుకొన్నారు.

## మన రాష్ట్రానికి ప్రథమస్థానం

శ్రీకాకుళం జిల్లా షేర్ మహమ్మద్ పురం బ్లాకులో జనవరి 14 వ తేదీన జరిగిన సభలో ప్రసంగిస్తూ కేంద్ర ప్రభుత్వ సమాజాభివృద్ధి శాఖామాత్యులు శ్రీ యస్. కె. డే. గారు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అక్షరక్రమంలోనేకాక, వ్యవసాయ విధానాలు, పంచాయతీలు, సహకారరంగాలలో భారతదేశంలో ప్రధానస్థానం ఆక్రమిస్తున్నదని పేర్కొన్నారు. సమాజాభివృద్ధి కార్యక్రమాల ప్రధానలక్ష్యం ప్రజలకు అధికారం బదిలీచేయడమేననీ, ప్రభుత్వ సహాయంలేకుండా వారు పురోగమించటానికి వారిని తయారు చేయటమేననీ వారు పేర్కొన్నారు. పంచాయతీసమితుల విషయంలో ఆంధ్రప్రదేశ్, మద్రాసు రాష్ట్రాలు ముందడుగువేసి పని చేస్తున్నాయని శ్రీ డే గారు ప్రశంసించారు.

## ముందుకు

జనవరి 28 వతేదీన కాకినాడలో గాంధీ మెమోరియల్ మిషన్‌కు ప్రారంభోత్సవంచేస్తూ, కేంద్ర ఆరోగ్యశాఖామాత్యులు శ్రీ డి. పి. కర్మార్కర్ గారు ఆంధ్రప్రదేశ్ ఆదిలో కొన్ని యిబ్బందులను ఎదుర్కొవలసి వచ్చినా, స్వయంశక్తితో, ప్రజల బలంతో ముందుకు పోతున్నదని వర్ణించారు. వైద్య విద్య మొదలగు విషయాలలో రాష్ట్రప్రభుత్వం సాధించిన అభివృద్ధి గణనీయమైనదని పేర్కొంటూ, యీ సంస్థకు సాధ్యమైనంత త్వరలో గ్రాంటు లభింపజేయటానికి శాయశక్తుల ప్రయత్నిస్తానని హామీ యిచ్చారు.



# జిల్లాల వార్తలు

## నిజామాబాదు

నిజామాబాదు కేంద్రం ధర్పల్లె గ్రామంలో 1959 జనవరి 16 వ తేదీన, జిల్లాకలెక్టరు శిశు సంక్షేమం, ప్రసూతి కేంద్రానికి ప్రారంభోత్సవం, ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి శంకుస్థాపనచేశారు. ఈ సందర్భంలో ఎగువసభ సభ్యుడు శ్రీ సి. హనుమంతరెడ్డి తదితర అనధికార ప్రముఖులు ప్రసంగించారు.

## పశ్చిమగోదావరి

విద్యార్థుల్లో ప్రణాళికా చైతన్యాన్ని కలిగించడానికీ, వారి ప్రతిభాసామర్థ్యాలు ,సమాజాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో ప్రజాసహకారం లభించడంలోవినియోగ పడడానికి పశ్చిమగోదావరి జిల్లాలోసంగీత, నాటకోత్సవాలు నిర్వహించబడినవి. ఇవి ఏలూరు గాంధీజాతీయ విద్యాలయంలో 1959 జనవరి 15, 16వ తేదీల్లో ఉన్నత పాఠశాలలకొరకు జరుపబడినవి.

న్యాయనిర్ణేతలు, ఆకివీడు బోర్డు ఉన్నతపాఠశాల నాటకబృందానికి ప్రథమ బహుమానం, గుండుగొలను బోర్డు ఉన్నతపాఠశాలవారికి ద్వితీయ బహుమానం ప్రకటించారు. ఏలూరు థియొసాఫికల్ ఉన్నతపాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ ఎం. నరసింహమూర్తికి, నాటకనిర్వహణకూ, గుండుగొలను బోర్డు ఉన్నతపాఠశాల విద్యార్థి శ్రీ ఎం. సత్యనారాయణకు సంగీతానికి ఆకివీడు బోర్డు ఉన్నత పాఠశాల విద్యార్థిని కుమారి బి. రామలక్ష్మికి నటనకు ప్రత్యేక బహుమతులివ్వబడినవి.

ఇంకా సిద్ధాంతం బోర్డు ఉన్నత పాఠశాలకీ, ఏలూరు మున్సిపల్ ఉన్నత-పాఠశాలకి యోగ్యతా పత్రాలు కూడా ఇవ్వబడినవి. ఈనాటకాలను సుమారునాలుగువేలమంది ప్రేక్షకులు తిలకించారు.

శ్రీమతి వి. శ్రీనివాసన్ బహుమతులు పంచిపెట్టారు. ఈ సందర్భంలో ఏలూరు త్యాగరాజ సంగీతసభ కార్యదర్శి శ్రీ కె. వి. సుబ్బారావు ప్రసంగిస్తూ, సంప్రదాయకమైన కళల పునరుద్ధరణకు ప్రభుత్వం చేస్తున్నకృషిని అభినందించారు.

## అనంతపురం

రాష్ట్ర శాసనసభ సభ్యుడు శ్రీ కల్లూరి సుబ్బారావు 1958 డిశెంబరు 29 వ తేదీన రాయదుర్గంలో ప్రిఎక్స్టెన్షన్ కేంద్రాన్ని ప్రారంభించారు. ఈసందర్భంలో ప్రసంగిస్తూ, ప్రజలు తమ బాధ్యతలను గుర్తించి అధికంగా శ్రమించాలని ఆయన విజ్ఞప్తి చేశారు. శాసనసభ సభ్యుడు శ్రీ యన్. సి. శేషాద్రి సమావేశానికి అధ్యక్షత వహించారు.

అనంతపురం కలెక్టరు పర్సనల్ అసిస్టెంటు శ్రీ జగన్నాథాచారికూడా ప్రసంగించారు. ఆరాత్రి అనంతపురం ఎన్. జి. ఓ. లు "ఆత్మశక్తి" అనే నాటకం ప్రదర్శించారు. నాటకం చూడటానికి అనేకమందిజనం వచ్చారు.

మొదట జిల్లా ప్రణాళికాధికారి వక్తలకూ, సమావేశంలో పాల్గొన్న ఇతరులకు స్వాగతంచెప్పారు.

## విశాఖపట్నం

చోడవరం తాలూకా పెద్దడికి కొత్తగా మంజూరు చేయబడిన ప్రిఎక్స్టెన్షన్ కేంద్రాన్ని జిల్లా కలెక్టరు 1957 డిశెంబరు 25 వ తేదీన ప్రారంభించారు. దీనితో ఈ జిల్లాలోని బ్లాకులసంఖ్య-రెండు బహుళార్థ సాధక ప్రాజెక్టులైన అరకులోయ హుకుంపేటలతో కలుసుకొని-పదిహేను అయింది. ఈ సందర్భంలో, శాసనసభ సభ్యుడు శ్రీ డి. శ్రీరామమూర్తి, అనకాపల్లి, ఏ. ఎం. ఏ. ఎల్. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఆర్. సుబ్బయ్యానాయుడు

విశాఖపట్నం మిసెస్ ఏ. వి. యన్. కళాశాలకు చెందిన శ్రీ ఆర్. లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ బి. వి. కృష్ణమూర్తి, శాసనసభ సభ్యుడు శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు శ్రీ కె. రమేశన్ (చోడవరం) ప్రభృతులు ప్రసంగిస్తూ ప్రణాళికో ద్యోగులతో సహకరించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. క్రొత్తగా ప్రారంభించబడిన ఈబ్లాకు సమర్థవంతంగా పనిచేయడానికై ధన, వస్తురూపాల్లో భూరి విరాళాలివ్వడానికి ప్రజలు ముందుకు రావాలనికూడా వీరు కోరారు.

విజయనగరం సబ్ కలెక్టరు మాట్లాడుతూ, గ్రామ సహాయకుడూ, ఎక్స్టెన్షన్ ఉద్యోగులూ, బి. డి. ఓ. ప్రజలతో మంచి సంబంధాలు పెట్టుకోవడానికి కృషి చేయాలని కోరారు.

కలెక్టరు రోడ్డు నిర్మాణపు పనిని ప్రారంభించారు శాసనసభ్యుడు శ్రీ డి శ్రీరామమూర్తి వందన సమర్పణం చేశారు.

## గుంటూరు

మంగళగిరి 1 వ స్టేజి సి. డి. బ్లాకు అధ్వర్యాన యెర్రబాలెంలో 1958 డిసెంబరు 28 నుంచి 31 వ తేదీవరకు గ్రామసహాయకుల శిక్షణాశిబిరం నిర్వహించబడింది. యెర్రబాలెం, నవులూరు, బాపూజీ నగర్‌లకు చెందిన 44 మంది ఈ శిబిరంలో శిక్షణ పొందారు. యెర్రబాలెం పంచాయతీసభ్యుడు శ్రీ దోనె వెంకటేశ్వర్లు, 1958 డిశెంబరు 29 వ తేదీ ఉదయం జాతీయపతాకం ఎగురవేశారు. మంగళగిరి బ్లాకు ప్రణాళికలు అభివృద్ధి కమిటీఉపాధ్యక్షుడు, శ్రీ అన్నె సంజీవయ్య శిబిరాన్ని ప్రారంభించారు.

రెండవరోజున శాసనసభ సభ్యుడు శ్రీ మేకా కోటిరెడ్డి శిక్షణపొందుతున్నవారిని ఉద్దేశించి ప్రసంగిస్తూ, ప్రణాళికాశాఖచే కల్పించబడుతున్న ప్రయోజనాలనుంచి వారు పూర్తిలాభం పొందాలని ఉద్బోధించారు. బ్లాకు ఉద్యోగులు ఆ మూడురోజులూ వ్యవసాయం, పశుపోషణ, చిన్నరకం నీటి వనరులను గురించి మాట్లాడారు. చివరిరోజున, వ్యవసాయోత్పత్తిని పెంపొందించడానికి తీవ్రంగా కృషిచేయవలసిందని, బి. డి. ఓ., శిక్షణ పొందుతున్న వారిని కోరారు. సమాజాభివృద్ధి కార్యక్రమాలను వివరించే ప్రదర్శనం ఒకటి ఈ శిబిరావరణంలో ఏర్పాటు చేయబడింది. శిక్షణశిబిరం పనిచేసిన అన్ని రోజుల్లోనూ సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడినవి

## తాళ్లూరు బ్లాక్

తాళ్లూరు 1వ స్టేజి బ్లాక్ అధ్వర్యాన నెమిలికల్లు గ్రామంలో జరిగిన మూకఉమ్మడి శ్రమదాన కార్యక్రమానికి 1958 డిశెంబరు 21 వ తేదీన బి. డి. ఓ. ప్రారంభోత్సవం చేశారు. అమరావతి - గుంటూరు రోడ్డుమార్గంలో 14వ మైలువద్ద, తమ గ్రామాలతో కలుపగల రోడ్డునిర్మాణపు పనిని చేపట్టినందుకు నెమిలికల్లు, మండెపూడి గ్రామస్థులు చాలా ఆనందించారు.

## గ్రామ సహాయకుల శిక్షణశిబిరం

మంగళగిరి 1వ స్టేజిసమాజాభివృద్ధి కేంద్రం అధ్వర్యానచిర్రావూరు గ్రామంలో 1958 డిశెంబరు 16 నుంచి 18 వ తేదీవరకు గ్రామసహాయకుల శిక్షణాశిబిరం నిర్వహించ బడింది చిర్రావూరు పంచాయత్ అధ్యక్షుడు శ్రీ ఎం. వెంకటేశ్వరరావు జాతీయ పతాకం ఎగురవేసిన తరువాత ఆ గ్రామానికి చెందిన పురోగామి అయిన ఒకరైతు డి బ్రహ్మానందరావు ఈశిబిరాన్ని ప్రారంభించారు. ఇందులో మూడు గ్రామాలకు చెందిన వ్యక్తులు శిక్షణ పొందారు. శిబిరం నిర్వహించ బడినఅన్ని రోజుల్లోనూ సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడినవి.

## కృష్ణా

భారత్ సేవక్ సమాజ్ మచిలీపట్టణంశాఖ కురాడలో రూ. 5,200 ల వ్యయంతో రోడ్డువేసింది. ఈ నిర్మాణ వ్యయంలో సగంమొత్తాన్ని గ్రాంటు రూపంలో పొందడం జరుగ్గా మిగిలినదాన్ని ప్రజలు నగదు రూపంలోనూ, శ్రమదాన రూపంలోనూ, యిచ్చారు.

రోడ్లను, కలెక్టరు జనవరి 22వ ప్రారంభించారు. భారత్ సేవక్ సమాజ్ అధ్యక్షుడుకూడా అయిన

కేంద్ర ప్రణాళికాశాఖ మంత్రి ఈసందర్భంగా పంపిన ఒక సందేశంలో ప్రస్తుతం అన్ని రంగాలలోనూ సహకార కృషి అవసరమని పేర్కొన్నారు.

కలెక్టరు రోడ్లనూ, రూ. 9,000 ల వ్యయంతో త్రవ్వబడిన కాలువను తనిఖీచేశారు. ఈకాలువ 300 ఎకరాల మాగాణి భూమిలో నీటిపారుదల చేయగలదు.

తరువాత జిల్లా ప్రణాళికాధికారి అధ్యక్షతన జరిగిన ఒక బహిరంగసభలో భారత్ సేవక్ సమాజ్ కన్వీనరు శ్రీ కృష్ణజీ, కలెక్టరు మాట్లాడారు. అనేక ప్రయోజనాలు చేకూర్చగల చిన్నమొత్తాల పొదుపుకై అందరూ పెట్టుబడి పెట్టవలసిన ఆవశ్యకతను కలెక్టరు వివరించారు. సమాజాభివృద్ధి, వ్యవసాయం, చిన్నమొత్తాల పొదుపుకు సంబంధించిన పుస్తకాలు సభలో పంచిపెట్టబడినవి. వివిధ నాయకులనుంచి వచ్చిన సందేశాలను శ్రీ కురాడ వెంకటరత్నం చదివి చివరలో వందన సమర్పణం చేశారు.

## శ్రీ డే చే పందూరు బ్లాకు సందర్శన

కేంద్ర సమాజాభివృద్ధి మంత్రి శ్రీ యస్. కె. డే, ఒరిస్సా ప్రభుత్వ ప్రధానకార్యదర్శి, అభివృద్ధిశాఖ కమీషనర్ శ్రీ శివరామన్, శ్రీకాకుళం జిల్లా కలెక్టరు శ్రీ హాషిమ్అలీఖాన్, ఐ. ఏ. ఎస్. షేర్ మొహమ్మద్‌పురం బ్లాక్‌లోని పందూరు గ్రామాన్ని 1959 డిశెంబరు 14వ తేదీన సందర్శించారు. జిల్లా ప్రాజెక్టు నిర్వహణ కమిటీచే నడప బడుతున్న సాంఘిక సంక్షేమ కేంద్రాన్ని శ్రీ డే. సందర్శించారు.

ఈ సందర్భంలో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ శ్రీ డే, వ్యవసాయోత్పత్తి, పంచాయతీలు సహకారరంగాలలో ఆంధ్రప్రదేశ్ గణనీయమైన అభివృద్ధి సాధించినదని సంతృప్తి వెల్లడించారు. ప్రభుత్వ సహాయంలేకుండా ప్రజలే ముందుకు నడవడానికి వీలుగా అధికారాలను వారికి పంపిణీచేయడమే సామాజాభివృద్ధి ముఖ్యోద్దేశమని ఆయన అన్నారు.

గార బ్లాక్ కేంద్రకార్యస్థానాన్ని కూడా శ్రీ డే సందర్శించారు. గార పంచాయత్ అధ్యక్షుడు కేంద్రమంత్రికి సమర్పించిన సన్మానపత్రంలో ఆప్రాంతంలోవున్న నీటిఎద్దడి దృష్ట్యా వంశధారా ప్రాజెక్టు నిర్మాణాన్ని సాధ్యమైనంత తొందరలో ప్రారంభించడం అవసరమని విజ్ఞప్తిచేశారు. మంత్రిగారు మాట్లాడుతూ రాష్ట్రంలో పంచాయతీ సమితుల స్థాపనతో సమాజాభివృద్ధి త్వరితగతిని జరగడానికి వీలుకలిగిందన్నారు.

శ్రీ శివరామన్ మాట్లాడుతూ సమాజాభివృద్ధి కార్యక్రమాలకు సరిహద్దులతో ప్రమేయం వుండదనీ, కనుక ఇరుగు పొరుగు రాష్ట్రాలైన ఒరిస్సా ఆంధ్ర ప్రదేశ్‌లు మున్ముందు పరస్పర ప్రయోజనాలకై సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచు కొనగలవని అన్నారు.

శ్రీ డే యిటీవలనే ఒరిస్సారాష్ట్రంలో పర్యటించిన సందర్భంలో జయపూర్ నుండి బరంపురంకు వెళ్లేదారిలో శ్రీకాకుళంజిల్లా సందర్శించారు.

## మహబూబ్‌నగర్

సమాజాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణను పరిశీలించడానికై ఐ. రా. సమితి తరఫున కమ్యూనిటీ అభివృద్ధి పరిశీలనసంఘంవారు 1959 జనవరి 6వ తేదీన షాద్‌నగర్ సందర్శించారు. ఐక్య రాజ్యసమితికి చెందిన సాంకేతిక సహాయవిభాగం సాంఘిక వ్యవహారాల బ్యూరోలచే నిర్వహించబడుతున్న ఈ పరిశీలన సంఘంలో కెనడా పార్లమెంటు మాజీ సభ్యుడు డా. ఎం. జె. కోల్డ్‌వెల్ కూడా ఉన్నారు. డా॥ ఎం. జె. కోల్డ్‌వెల్ పంచాయిత్ సమితి సభ్యులను ఉద్దేశించి మాట్లాడుతూ, ఇండియాలోని అన్ని ఇతరబ్లాకులకంటే షాద్‌నగర్ బ్లాక్ సర్వతోముఖాభివృద్ధి సాధించిందన్నారు. అధికాహారోత్పత్తి ప్రాముఖ్యాన్ని పేర్కొంటూ డా॥ కోల్డ్‌వెల్, దారిద్ర్యనిర్మూలనకు కృషిచేయాలనీ, గ్రామాలలో సర్వతోముఖాభివృద్ధిని సాధించాలని సభ్యులకు విజ్ఞప్తిచేశారు.

బ్రిటిష్ విద్యావేత్త డా. మార్గరెట్ హెలెన్‌రీడ్, ఫ్రెంచ్ వ్యవసాయ ఆర్థికవేత్త రెనె ఫెర్వెండ్,

డెవ్మెంట్, ఆసియా, దూర ప్రాచ్యాల ఆర్థికసంఘం, సమాజాభివృద్ధి సలహాదారు డా. అంటోనీ బి. వీజిక్కీలు సమావేశానికి హాజరైనారు.

మిషన్ సభ్యులను పాపిరెడ్డిగూడా, బూర్గుల్, కమదానం, బాలానగర్ లకు తీసుకొవెళ్లారు. జిల్లా పరిణాళికాధికారి శ్రీ పి. రాజగోపాలరావు, బి. డి.ఓ. శ్రీ డి. జె. శామ్యూల్ వీరివెంట ఉన్నారు. బ్లాక్ స్థాపించినప్పటి నుంచివచ్చిన మార్పులను గురించి వీరు గ్రామస్థులతో ముచ్చటించారు. తరువాత వీరు బ్లాక్ సిబ్బందితో చర్చలు జరిపారు. శ్రీ కె. బి. లాల్, పంచాయతీ సమితుల, గ్రామపంచాయితీల స్థాపననుగురించి వీరికి వివరించి చెప్పారు.

## గుంటూరు జిల్లా నీటిపారుదల మహాసభ

గుంటూరుజిల్లాలో ఆహారోత్పత్తిని పెంచడానికి తీసుకోదగ్గ చర్యలవిషయమై చర్చించటానికి 1958 డిశెంబరు 29వ తేదీన గుంటూరులో నీటిపారుదల, విదుచ్ఛక్తి శాఖమంత్రి శ్రీ జె వి. నరసింగరావు అధ్యక్షతన జిల్లానీటి పారుదల మహాసభ జరిగింది స్పెషల్ ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఎల్. వెంకటకృష్ణయ్యర్, నీటిపారుదల ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఏ. ఆర్ వెంకటార్రామన్, శ్రీ జి ఏ. నరసింహారావు, వి పప్పు, జిల్లా శా. స. సభ్యులు, ఎగువసభ సభ్యులు మహాసభకు హాజరైనారు కలెక్టరు శ్రీ ఎం ఏ హలీమ్, ఐ.ఏ.ఎస్, సభికులకు స్వాగతం చెప్పారు

ప్రారంభంలో శ్రీ నరసింహారావు మహాసభ ఉద్దేశాన్ని వివరించారు జిల్లా రైతులూ, ప్రజలు ఒక చోట కలుసుకొని ఒకరి భావాలను ఒకరు తెలుసుకోవడానికి అవకాశం కల్పించాలన్నదే తమ ఆశయమైనట్టు అయన చెప్పారు. మహా సభలో వెలుబుచ్చబడిన అభిప్రాయాలను ప్రభుత్వం తప్పకుండా పరిశీలించ గలదని అయన హామీఇచ్చారు.

శ్రీ ఏ. ఆర్. వెంకట్రామన్ జిల్లాలో జరిగిన నీటి వనరుల అభివృద్ధిని ప్రస్తావించి వీటి విస్తరణకు గల అవకాశాలను వివరించారు

శా. స సభ్యులు, ఎగువసభ సభ్యులు తదితర అనధికార ప్రముఖులు కూడా మాట్లాడారు. జిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు కృతజ్ఞతాభి వందనాలు తెలియ జేశారు.

## ఆస్పత్రి భవనాలకు శంకుస్థాపన

కేంద్ర ఆరోగ్య మంత్రి శ్రీ డి. పి. కర్మార్కర్, 1959 జనవరి 1 వ తేదీన వెంకట్రాయపురం(తణుకు) లో శ్రీ ముళ్లపూడి వెంకట రమణమ్మ స్మారక ఆసుపత్రి భవనాలకు శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు అధ్యక్షతన ఒక బహిరంగసభ జరిగింది. శ్రీ ఎం. హరిశ్చంద్ర ప్రసాద్ మంత్రులకు స్వాగతం చెప్పారు. అనేకమంది శా.స. సభ్యులు, ఎగువసభ సభ్యులు, పార్లమెంటు సభ్యులు, వివిధ జిల్లా శాఖోద్యోగులు ఉత్సవానికి వచ్చారు.

శ్రీ కర్మార్కర్ మాట్లాడుతూ తణుకుకు వచ్చి తాను ఈ సమావేశంలో పాల్గొంటున్నందుకు చాలా ఆనందిస్తున్నామన్నారు. ఆసుపత్రిలో టి. బి. శానిటోరియం కూడా చేర్చినట్లయితే కేంద్రం వారికి ఎక్కువగా సహాయ పడగలదని శ్రీ కర్మార్కర్ ధర్మకర్తల బోర్డును కోరారు. రాష్ట్రంలో ఆరోగ్యాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తున్నదని పేర్కొంటూ అందుకు కారణమైన సంజీవరెడ్డి మంత్రివర్గాన్ని శ్రీ కర్మార్కర్ అభినందించారు.

ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, శాసన సభాధ్యక్షుడు శ్రీ ఏ. కాళేశ్వరరావు, విద్యా మంత్రి శ్రీ ఎస్.బి.పి. పట్టాభిరామారావు, ఎగువసభ అధ్యక్షుడు శ్రీ ఎం. హనుమంతరావు, కేంద్రమంత్రి శ్రీ కె. సి. రెడ్డి తదితర ప్రముఖులు పంపిన సందేశాలు చదువబడినవి. ఈ సందర్భంలో మాట్లాడుతూ వైద్యశాఖ డైరెక్టరు మేజర్ కె. ఎస్. రావు ముళ్లపూడివారి కుటుంబానికి కృతజ్ఞతలు తెలియజేశారు. తణుకులో పుట్టుకురుపు, క్షయవ్యాధుల ఆసుపత్రులను స్థాపించే విషయాన్ని పరిశీలించాలని కూడా అయన కేంద్రాన్ని కోరారు.

మనదేశంలో, జనాభా పెరుగుదల దృష్ట్యా కుటుంబనియంత్రణ చాలా అవసరమని శ్రీ జె. వి. నరసింగరావుఅన్నారు శ్రీ కె గంగాధరం వందన సమర్పణంచేశారు.

# పనిద్వారా విద్య - దాని ప్రయోజనములు

( సి. వెంకటరాజమ్, ప్రభుత్వ బేసిక్ ట్రెయినింగ్ స్కూలు, కరీంనగరం. )

పనిద్వారా విద్య అనగా మన జీవితములో పనికి వచ్చు ఏదేని ఒకపనికి సమన్వయపరచి విద్యను బోధించుట యని అర్థము. ఈసిద్ధాంతము చాల గొప్పది. శిశువునకుగల అంతర్గత శక్తులను బహిర్గతముచేసి సర్వతోముఖాభివృద్ధి కల్పించి జీవితమును సక్రమముగా నడుపుకొనునట్లు చేయుటయే ఈసిద్ధాంతము యొక్క ముఖ్యలక్ష్యము. పని ద్వారా విద్యజరుగ వలెననియు, ఇది స్వయంకృషి విధానమనియు, దీనివలన పెక్కులాభములు గల వనియు ప్రముఖ విద్యావేత్తలందరు ఏకగ్రీవముగా నుడివిరి.

నేటి పాఠశాలలయందు పుస్తక కేంద్రితమైన విద్య గరపబడుచున్నది. ఇట్టివిద్యకు, బాలుని జీవితమునకు ఏలాటి సంబంధము లేకపోవుటవలన వారి వ్యక్తిత్వము నశించుచున్నది. కావున బాలురయందు సర్వాంగీణ వికాసముకలుగ జేయుటకు విద్యశ్రమ కేంద్రితమై యుండవలెను. విద్యను శ్రమకేంద్రితముచేయుటకు దానిని మానవ జీవితములోని ప్రధాన సమస్యలను తీర్చుపరిశ్రమకు జతపరచి బోధించవలెను.

ఇట్లుపనిద్వారా విద్యార్జన చేసిన ప్రతిబాలుడు తన జీవితములోని ప్రధాన అవసరములను స్వయముగా తీర్చుకొని స్వయంపోషకముగా జీవితమును గడుపుటకు తగినశక్తి, సామర్థ్యములను కలిగియుండును. దీనివలన నిరుద్యోగ సమస్య సమసిపోవుటకు అవకాశముండును.

ఒకపనిని చేసి నేర్చుకొన్నటువంటి విషయములు చిరకాలము జ్ఞాపకముండును. జీవితాంతము వరకు అవి మఱపురావు.

మనము ఏపనిని ఆధారముగా చేసుకొని విద్య నభ్యసించెదమో దానివలన విద్యా విషయములు తెలియుటయేకాక ఆపనియందు నేర్పరితనము కూడా కలుగును.

పనిద్వారా బోధించునపుడు బాలుడు నిత్య జీవితములోని పరిచితములగు అనుభవముల ద్వారా విద్య నేర్చుటవలన మనము విద్యాశాస్త్రములోని "తెలిసిన విషయలనుండి తెలియని విషయమును నేర్చుకొనుట" అనుసిద్ధాంతమును పాటించినవార మగుదుము. ఇట్లుతెలిసిన దానినుండి తెలియని విషయమును నేర్చుకొనుట వలన బాలురు విషయములను సులభముగా, ఉత్సాహముతో నేర్చుకొందురు,

పనిద్వారా విద్యను బోధించుట వలన బాలుర యందు జ్ఞానాభివృద్ధి యగుటయేకాక వారికి శరీర వ్యాయామము కూడా కలుగును. దీనివలన ఆరోగ్యము, ఆనందములభించును.

ఈవిధముగా విద్యాభ్యాసము చేయుటవలన విద్యయొక్క పరిధానోద్దేశములన్నియు నెరవేరును. కావుననే గాంధీమహాత్ముడు ఈ విధానమునకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చెను. ఇది నేటిబేసిక్ విద్యా విధానమునందలి ప్రధాన సూత్రమైయున్నది.





శిబిరాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు. ఆ సందర్భంలో శ్రీ ఎస్. కె. డే ప్రసంగిస్తున్న దృశ్యం.

సమాజాభివృద్ధిపై

# పార్లమెంటు సభ్యుల పరిశీలనా శిబిరం

మెదక్ జిల్లాలో బ్లాకు పంచాయతీ సమితి ముఖ్య కార్యాలయంగల పట్టన్‌చెరువు దేశంలో సమాజాభివృద్ధి ప్రగతిలో కొత్త ప్రయోగం చేయుటకు వసతి కల్పించింది. సమాజాభివృద్ధిపై లోకసభ సంప్రదింపుల సంఘం సభ్యులు, రాష్ట్ర ఇన్‌ఫార్మల్ సంప్రదింపుల సంఘం సభ్యుల నిమిత్తం అక్కడ 1959 జనవరి 29 మొదలు ఫిబ్రవరి 4 వరకూ పరిశీలనామండల శిబిరం (స్టడీ సర్కిల్ క్యాంపు) యేర్పాటు చేయబడింది. దానికి వివిధ రాష్ట్రాలకు చెందిన 17 మంది లోకసభ సభ్యులు, అంతే సంఖ్యలోగల రాష్ట్ర శాసనసభ సభ్యులు హాజరయారు. కేంద్ర సమాజాభివృద్ధి శాఖా మంత్రి శ్రీ ఎస్. కె. డే, రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధిశాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు ఆ వారం రోజులు అక్కడవుండి చర్చలలో పాల్గొన్నారు. ఆ చర్చలు అంతకుముందు సమాజాభివృద్ధి మంత్రిత్వ శాఖ తయారుచేసిన పత్రాలపై ఆధారపడి జరిగాయి. ఆ పత్రాల శీర్షికలు యివి : "మనము, మన దేశము", "మనము, మన సమాజము", "మన సమస్యలు, మన ప్రణాళికలు", "మన పరిపాలన, జాతీయవిస్తరణ సేవ", "మన త్రివిధ ప్రాథమిక సంస్థలు-పంచాయతీ, సహకార సంఘం, పాఠశాల", "మన బ్లాకు అభివృద్ధి సంఘాలు", "అమలు జరుగుతున్న మన కార్యక్రమము."



4-2.59 న జరిగిన వీడ్కోలు వుత్సవానికి రాష్ట్ర సహకారశాఖా మంత్రి శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ అధ్యక్షత వహించారు.



సభ్యుల శ్రమదానం
(8)

**ఈ** శిబిరాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్ సంజీవరెడ్డి ప్రారంభించారు. ఫిబ్రవరి 4 న వీడ్కోలు వుత్సవానికి రాష్ట్ర సహకార మంత్రి శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ అధ్యక్షత వహించారు.

సమాజాభివృద్ధి వివిధాంశాలపై చర్చలు జరుపుతే కాక శాసనసభ్యులు, యితరులు ప్రతిరోజూ శ్రమదానంకూడా చేసేవారు. వారు బురదను తవ్వితీసి అనాచ్ఛాదితమయిన రంగస్థలం నిమిత్తం భూమిని సమతలం చేశారు. మొక్కలు నాటుటకై గోతులుకూడా తవ్వారు. ఆ చుట్టుపట్లగల పెక్కు గ్రామాలను దర్శించి ప్రజల జీవితాన్ని స్వయంగా చూశారు. తొలిరోజున పటన్‌చెరువు బ్లాకు పంచాయతీ సమితిచే స్వాగతపత్రం సమర్పించబడింది. సమితి సభ్యులు 6 వ రోజున మళ్లీ లోకసభ సభ్యులను, సమాజాభివృద్ధి శాఖామంత్రిని కలుసుకున్నారు ఆఖరిరోజున బహిరంగ సభకూడా జరిగింది

శిబిరంలోని కార్యక్రమానికి తోడు లోకసభ సభ్యులు, యితరులు రాజేంద్రనగర్‌లోని శిక్షణా కేంద్రాలను దర్శించారు. సాయంకాలాలు శిబిరంలో సాంస్కృతిక ప్రదర్శనలు యేర్పాటు చేయబడ్డాయి.

## చర్చలు

ఈ కార్యక్రమం అమలుకి అత్యవసరమయిన ప్రధానాంశాలపై జరిగిన చర్చ సారాంశం దిగువ యివ్వబడింది

స్వాతంత్ర్య సముపార్జన పిమ్మట, సమాజాభివృద్ధి కార్యక్రమం ఒక్కటే అన్ని రాజకీయ పక్షాలకి వుమ్మడివేదికగా వున్నది. ప్రజాసేవచేసే వారందరికీ అది అవకాశం కల్పిస్తున్నది

సమాజాభివృద్ధి కార్యక్రమం, పరిమిత విధానంలో ప్రారంభింపబడినప్పటికీ, దాని అసలు ప్రయోజనాన్ని మించి విస్తరించింది, మొత్తం గ్రామీణ అభివృద్ధికి అది ప్రధానపాత్ర వహించవలసిన ఘట్టం వచ్చింది. ఆ విధంగా అది యెక్కువ సమగ్రమయిన పాత్ర వహించింది కార్యరంగం విస్తరించింది. సమగ్రమయిన అభివృద్ధి కార్యక్రమం అమలుకై ఒక



రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్ పి పాయ్ మొక్కను నాటుతున్న దృశ్యం.



చుట్టుపట్ల గ్రామాలను సందర్శిస్తున్న శిబిర సభ్యులు.

ప్లానులో వినియోగింపదగు వనరులన్నీ సమీకరించ బడాలి.

"ప్రజాస్వామ్య వికేంద్రీకరణ" సూత్రానికి సర్వాంగీకారం లభించుటతో తృతీయ పంచవర్ష ప్రణాళికలో 3 విభాగాలు—కేంద్ర విభాగము, రాష్ట్ర విభాగము, స్థానిక విభాగము—వుండుట అత్యవసరం. ప్రతి విభాగానికి చెందిన పథక నిర్మాణంలో "ఆదాయం ప్రణాళిక" (రిసోర్సుప్లాన్) "వ్యయం ప్రణాళిక" (ఔట్‌లేప్లాన్) రెండూకూడా వుండాలి.

తృతీయ పంచవర్ష ప్రణాళికలో సహకార విభాగానికి నిర్దిష్టమయిన స్థానం యివ్వబడాలి. ఆ విధంగా ఆ ప్రణాళికలో 3 విభాగాలలో—ప్రభుత్వ విభాగం, సహకార విభాగం, ప్రైవేటు విభాగం—పని జరగాలి. సహకార విభాగం సరిగా అభివృద్ధి చేయబడినట్లయితే, అది ప్రభుత్వ విభాగానికి సహాయ సహకారాలను అందిస్తుంది; ప్రైవేటు విభాగం నిర్దుష్టంగా పని చేసేలా చేస్తుంది.

శక్తివుండి యిష్టపడే ప్రతి స్త్రీ, పురుషుడు తమ తమ తీరికకాలాన్ని, శక్తిని పూర్తిగా వినియోగించుకొనుటకు తృతీయ ప్రణాళిక వీలుకలిగించాలి.

## ప్రాతిపదిక

ఈనాటి గ్రామీణ సమాజంలో యేకప్రయోజనంగల భిన్నవర్గాలు వున్నాయి. అట్టి వర్గాలను వుత్పత్తివర్గము, సాంఘిక సేవావర్గము అని స్థూలంగా విభజించవచ్చు. ఉత్పత్తివర్గంలో మళ్లీ రెండు విభాగాలున్నాయి: 1. భూమినుంచి వస్తూత్పత్తిని పొందే వర్గము, 2. చేతిపనులద్వారా వస్తువులను వుత్పత్తిచేసే వర్గము. ఈ వర్గాల ప్రయోజనాలను న్యాయంగా, సరిగా యేర్పరుచుటవల్లనూ, వారి పరస్పర ఆధారం ప్రాతిపదిక వల్లనూ సంఘానికి ఒక

పటిష్టత యేర్పడుతుంది. దానిని గ్రామీణ పునర్నిర్మాణానికి ప్రాతిపదికగా తీసుకోవచ్చు

సమతుల్యమయిన ప్రయోజనాలు గల అట్టి గ్రామసమాజం ప్రాతిపదికగా, సుఖతర జీవనానికై ప్రజల ప్రోద్బలాన్ని, అన్నిస్థాయిలలోను అనధికార నాయకత్వం సేవా భావాన్ని, ఉద్యోగుల పరిపాలనానుభవాన్ని సేవాభావంతో సమిష్టి ప్రయోజనానికై సమీకరించినట్లయితే, గ్రామీణ పునర్నిర్మాణాభివృద్ధి శీఘ్రగతిని జరుగుతుంది.

## శిక్షణా కార్యక్రమాలు

అభివృద్ధి కమిషనర్ ద్వారా వివిధ అభివృద్ధి కార్యక్రమాల్ని నిజంగా సమర్థంగా సమన్వయపరచాలంటే, అందుకు సంబంధించిన అధికార్లందరికి జిల్లాస్థాయిలోను, అంతకుకింద స్థాయిలోను కూడా అవసరమైన విషయాలు బోధించ బడాలి ఇందు నిమిత్తమే, గ్రామ సేవకులు, సాంఘిక ఉర్గనైజర్లు, బ్లాకు అభివృద్ధి అధికార్ల నిమిత్తం వివిధ శిక్షణా కార్యక్రమాలు, శిక్షణా కేంద్రాలు చేపట్టబడినవి ఇప్పుడు బ్లా అ అ. కు 8 శిక్షణకేంద్రాలున్నాయి మరి ఆరింటిని ప్రారంభించాలని సంకల్పించ బడింది రాజేంద్రనగర్ లో జిల్లా పంచాయతీ అధికార్ల నిమిత్తం ఒక శిక్షణాకేంద్రం ప్రారంభింప బడవలసివుంది జిల్లాయితర సిబ్బందికి రిఫ్రెషర్ శిక్షణ యిచ్చే ప్రతిపాదనకూడా ఒకటి వున్నది

జిల్లాకలక్టరు మిక్కిలి ముఖ్యమైన అధికారి కాబట్టి జిల్లాలలో అభివృద్ధి కార్యక్రమం విజయానికి పూర్తి బాధ్యత ఆయనపై వుంచబడింది పాతరకం కలక్టర్లను అంటివున్న "రెవిన్యూ కాంప్లెక్సు" కాలక్రమేణా అదృశ్యం కావడంతథ్యం ఇప్పుడు బ్లాకు అభివృద్ధి అధికార్లు, ప్రాజెక్టు ఆఫీసర్ల తరగతులనుంచి వస్తున్న యువకలెక్టర్లు సంక్షేమ పరిపాలకులుగా పని చేయడం నిశ్చయం ఆంధ్రప్రదేశ్ లో జిల్లాకలక్టరు జిల్లాఅభివృద్ధి అధికారిగా పూర్తిపాత్రను వహించుటకు వీలుగా ప్రతిజిల్లాకి అదనపు కలక్టర్లను నియమించాలని సంకల్పించ బడింది

బ్లా అ అ సమితి క్రింది అధికారిగా పని చేయుట మంచిదని భావించబడింది అయితే ఆయన



శిబిరానికి హాజరయిన సభ్యులు



శిబిర ప్రతినిధులు

కలక్టరికి జవాబుదారీ వహిస్తాడు. ఇదికాక, ఆయన జిల్లా సాంకేతిక అధికార్ల ప్రతినిధిగా వారికికూడా జవాబుదారీ వహించాలి.

గడచిన ఆరున్నర సంవత్సరాలలోను యేర్పడిన పరిస్థితి మూలకంగా యిప్పుడు ప్రతిబ్లాకులోను 8 మంది విస్తరణాధికార్లు వున్నారు ప్రతిబ్లాకులోను యింకా యెక్కువమంది వ్యవసాయ విస్తరణాధికార్ల అవసరం యేర్పడింది కాని దేశంలో ప్రస్తుత పరిస్థితులలో ప్రస్తుతావసరాలకు సరిపడికూడా శిక్షణ పొందిన వ్యవసాయాధికార్లు లేనందున యిది సాధ్యం కాలేదు.

గ్రామస్థాయి కార్యకర్తలకు మొదటి 6 నెలలు మాత్రమే శిక్షణ యివ్వబడేది కాని యిప్పుడు బల్వంతరాయ్ మెహతా కమిటీ సిఫార్సుల ననుసరించి వారికి 2 సంవత్సరాలు శిక్షణ యివ్వబడు తున్నది విస్తృతమవుతున్న కార్యకలాపాలదృష్ట్యా ఒకరికిబదులు వేర్వేరు కార్యరంగాలలో ముగ్గురు గ్రామస్థాయి కార్యకర్తలు వుండాలని సూచించబడింది కాని అది ఆచరణయోగ్యమని భావించబడలేదు ఎందువల్లనంటే, అప్పుడు మరొక సమన్వయాధికారి అవసరం కాగలడు!

ప్రభుత్వంనుంచి డబ్బునుపొందే భారత్ సేవక్ సమాజ్, సాంఘిక సంక్షేమ సంఘంవంటి వివిధ అనధికార సంస్థలవిషయంలో, అవి బ్లాకుపంచాయతీ సమితులతోకలిసి, వాటి అజమాయిషీక్రింద పని చేయుట సముచితమని భావింపబడింది.

మనదేశ సాంఘికవ్యవస్థలో మార్పును తెచ్చుటకు తాము ప్రయత్నిస్తున్నామని చర్చలను ముగిస్తూ సమాజాభివృద్ధి శాఖామంత్రి అన్నారు రష్యా, చైనాలవంటి కమ్యూనిస్టు దేశాలుకూడా

ఆపని చేయుటకే ప్రయత్నిస్తున్నాయి. అయితే ఆదేశాలలో ప్రతిఒక్క స్థాయిలోను ప్రభుత్వ యంత్రాంగంతోపాటు పార్టీ యంత్రాంగంకూడా వుంటుంది. ఈరెండిటిని పరస్పరం మార్చవచ్చు. భారతదేశంలో బహువిధమయిన పార్టీలున్నాయి. కాబట్టి అట్టిపార్టీ యంత్రాంగం యేర్పాటు సాధ్యం కాదు. అందువల్ల అన్నిస్థాయిలలోను బహువిధ పార్టీ యేజన్సీని యేర్పాటు చేయాలి. మనం ప్రజాస్వామ్య పంథాలోచేసే ఆలోచన ననుసరించి యిదివస్తున్నది. మా ఆలోచనలలోనూ చర్యల లోనూ సమాజాభివృద్ధి కార్యక్రమం క్లిష్టపరిస్థితిని తెచ్చిపెట్టింది. వివిధ దానిని పరిష్కరించుటకై జాస్వామ్యస్థాయిలలో ప్రయంత్రాంగాన్ని ప్రవేశ పెట్టుటకు, నిర్ణయించవలసివచ్చింది. అదిన్యాయమైన చరిత్రాత్మకమయిన అవసరం.

## ప్రశంస

సమాజాభివృద్ధి కార్యక్రమం నిరంతరాయంగా కొనసాగాలి. ఇందునిమిత్తం కేటాయించబడే సొమ్ము ముఖ్యావసరాలకు మాత్రమే వస్తుంది. ఏసమయంలోనయినా అభివృద్ధికి కావలసినసొమ్ము నంతను ప్రభుత్వం గ్రాంటుగా యివ్వలేదు. ఆర్థికాభివృద్ధికి వుత్పాదక శక్తులకు పరపతిద్వారా పెట్టు బడి పెట్టుటద్వారా అది చాలా తోడ్పడగలదు· 2 వ. అంచె బ్లాకులకుయిచ్చే రూప లతుల గ్రాంటును తగినంతకాలం కొనసాగించ వలసి వుండవచ్చు. ప్రజల విరాళం విషయంలో ప్రస్తుతం ఆట్టిమమీ విరాళం నిర్ణయించబడింది; ప్రత్యేక సందర్భాలలో ప్రజలు దానిని యివ్వలేకపోతే తగినట్లు సడలించుటకు రాష్ట్రాలకు విచక్షణాధికారం యివ్వబడింది. ఆంధ్రప్రదేశ్ లో లాంఛనాలకు తుది రూపమివ్వబడే విధానాన్నిబట్టి, శాసనసభ బడ్జెట్టును ఆమోదించిన వెంటనే బ్లా. అ. అ. కి వివిధ పథకాలకై గ్రాంట్లు నిరాలస్యంగా లభిస్తున్నాయి. అందువల్ల ఆంధ్రప్రదేశ్ విధానం యెంతో ప్రశంసించ బడుతున్నది. ఇతరరాష్ట్రాలలో అధికార్ల దృష్టికి యీవిషయం తేబడవచ్చు.

ప్రణాళికల తయారీ గ్రామస్థాయిలో జరగాలని అంగీకరించబడింది. అయితే పైనవాటికి తుదిరూపమివ్వబడేముందు అవసరమయిన మార్పులు చేయ బడతాయి. ప్రణాళికల తయారీలో ముందు ప్రాధాన్యమివ్వబడవలసిన విషయాలలో వుత్పత్తి ప్రయోజనాలకి విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే విషయం ఒకటి. నిరుద్యోగం, చాలీ చాలని వుద్యోగాల సవాలు, యీ సదర్భంలో గ్రామీణ పరిశ్రమలకివ్వ వలసిన ప్రాధాన్యం వీటికికూడా ప్రాధాన్యమివ్వాలి.

కార్యక్రమంలో అధిక తమప్రాధాన్యం ఆర్థికాభివృద్ధికే యిచ్చినా ప్రజలనైతిక, సాంఘికాభివృద్ధుల పట్లకూడా తగినశ్రద్ధ చూపబడాలి. స్త్రీసాంఘిక విద్యా అర్గనైజర్లు, గ్రామసేవకుల పనివిషయంలో, పర్యటనకు బదులు వారు కొంతకాలం స్థిరంగా ఒకచోటవుండి యించుమించు 2 గ్రామసేవక సర్కిళ్లలో పనిజరిపితే బాగుంటుదని భావించబడింది. గ్రామీణ స్త్రీలు సాధారణంగా గ్రామసేవికలు, మంత్రసానుల సహాయాన్ని సంతోషంగా స్వీకరిస్తున్నారనీ, వారిఅవసరం ఇంకా యెక్కువగా వాంఛించ బడుతున్నదనీ, కనుగొనబడింది. పాఠశాల లన్నిటిలోనూ ప్రైమరీస్టాండర్డు వరకూ వుపాధ్యాయులుగా స్త్రీలను నియమించాలని ఒక సూచన చేయబడింది. ప్రాథమిక పాఠశాలలు ముందుతరాలకి సత్ప్రవర్తనకి తరిఫీదు సంస్థలుగా అభివృద్ధిపరప బడవచ్చు.

అభివృద్ధిపని సంస్థాగతమయిన విషయంలో గ్రా. స్థా. కా. వంటిసిబ్బంది పరిస్థితిని పునర్విమర్శింపవలసి రావచ్చు. పంచాయతీ కార్యదర్శులుగానో మరోవిధంగానో వారిని కూడా నూతన వ్యవస్థలోనికి కొనితేవలసి వుంటుంది.

## గ్రామసహాయికలకు కూడా

సమాజాభివృద్ధి శాఖామంత్రి సోమవారం జరిగిన చర్చలనుగురించి క్లుప్తంగా మాట్లాడుతూ, మొత్తం బ్లాకు కేటాయింపులో సిబ్బందివ్యయం అధికంగా వున్నదనే అభిప్రాయంతో పూర్తిగా యేకీభవించారు. ఈ కారణంవల్ల క్రిందిస్థాయిలో అనధికార ఏజన్సీలను ప్రభుత్వ ఏజన్సీకి తోడుగా అభివృద్ధిపరచి అందుకు సంబంధించిన సిబ్బందికి శిక్షణ యివ్వాలన్నారు.



సమాజాభివృద్ధిశాఖా మంత్రి ప్రభృతుల శ్రమదానం

ఇందునిమిత్తం, బ్లాకువారీ, జిల్లావారీ శిబిరాలను ఏర్పాటుచేయాలనే ప్రతిపాదనవుంది. గ్రామ సేవికలు నిర్ణీత ప్రాంతాలలో నిర్దిష్టకాలం పనిచేయాలన్న అభిప్రాయాన్ని కూడా ఆయన అంగీకరించారు. వచ్చేసంవత్సరం గ్రామసహాయకుల శిక్షణా కార్యక్రమంలో పంచాయతీలు, సహకార యూనియన్ల ప్రధానాధికార్లకేకాక గ్రామసహాయికలకుకూడా, స్వచ్ఛంద స్త్రీ కార్యకర్తలుగా పనిచేయుటకై, అవకాశం వుంటుంది.

ఆర్థికాభివృద్ధికి యెక్కువ ప్రాధాన్యమివ్వాలనే సూచన విషయంలో, అందుకు తాము యిదివరకే కృషిచేస్తున్నామన్నారు. విద్యుచ్ఛక్తి సరఫరాలో గ్రామాలన్నిటికి ముందు ప్రాధాన్యమివ్వాలన్న సూచన విషయంలో, అది చాలా కష్టమయినపని అయినందున ఆ ఆదర్శం సిద్ధించుటకు చాలాకాలం పడుతుంది. విద్యుచ్ఛక్తి అంత యెక్కువగాలేదు. రాగితీగ మున్నగు కావలసిన వస్తువుల విషయంలో కూడా చిక్కువున్నది. విద్యుచ్ఛక్తి వాడకం పోటీలో దురదృష్టవశాత్తూ పెద్దనగరాలు, పరిశ్రమలు అధికభాగాన్ని పొందుతున్నాయి. అయినప్పటికీ వుత్పత్తి ప్రయోజనాలకి గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరాఫరాకై తృతీయ ప్రణాళికలో మరికొంత వసతి కల్పించబడుతుంది. అలాగే రాకపోకల సౌకర్యాల విషయంలో కూడా, గ్రామాలకు పక్కా రోడ్ల నిర్మాణానికై చాలా యెక్కువసొమ్ము కావాలి. కాబట్టి యించుమించు 20, 30 సంవత్సరాలకి దానిని దీర్ఘకాలిక కార్యక్రమంగా తయారుచేయవలసి వచ్చింది. అయితే రాకపోకల సౌకర్యాల మంత్రిత్వ శాఖ యీ విషయంలో ఒక పెరస్పెక్టివ్ ప్రణాళికను తయారు చేస్తున్నది. రాష్ట్రప్రభుత్వాలుకూడా పైలట్ ప్రాజెక్టులను తయారు చేస్తున్నాయి.

ఏదైనా ఒక రాష్ట్రంలో ఒకానొక కార్యవిధానం సఫలమయినట్లయితే దానికి సంబంధించిన వివరాలను సమాజాభివృద్ధి మంత్రిత్వశాఖ మిగిలిన

అన్ని రాష్ట్రాలకు తెలియచేస్తుంది. బ్లా. అ. అ. కి సొమ్ము వెంటనే లభింపచేసే విషయంలో ఆంధ్ర ప్రదేశ్ విధానం విషయంలో ఇది వాస్తవం.

## సమస్య వర్గాలు

ప్రస్తుత భారతీయ సమాజంలో రెండే రెండు సమస్య వర్గాలున్నాయి. ఒకటి అన్ని విధాలా సౌకర్యాలు పొందగల వర్గము. రెండు అలా పొందలేని వర్గము. పంచాయతీ, సహకారసంఘం, పాఠశాలలనే ప్రాథమిక వ్యవస్థలు మూడింటి ద్వారాను, అన్నివిధాలా బాగున్నవర్గం రెండవ వర్గం భుజాలపై సవారీ చేయకుండా క్రమేణా నివారించే సాధనంగా బ్లాకు అభివృద్ధి సంఘంద్వారానుకూడా లోగసానుగా వున్న వర్గానికి ప్రత్యేక ఆర్థిక సౌకర్యాలు యేర్పడే పరిస్థితులను కల్పించుటయే యిప్పుడు ముఖ్యసమస్య. ఆరవరోజున "మన ప్రధాన సంస్థలు మూడు—పంచాయతీ, సహకార సంఘం, పాఠశాల" "మన బ్లాకు అభివృద్ధి సంఘాలు" పైజరిగిన చర్చలలో కేంద్ర సమాజాభివృద్ధి శాఖా మంత్రి శ్రీ ఎస్. కె. డే శిబిర సభ్యులను అడిగిన ముఖ్యప్రశ్న ఇది.

లోగసానుగా వున్న వర్గానికి ప్రత్యేక స్థానాల ద్వారా రాజ్యాంగంలో రక్షణలు యివ్వబడ్డాయనీ, యిప్పుడు కో ఆప్షన్ ద్వారా వారికి ప్రాతినిధ్యమివ్వబడుతున్నదని ఆయన అన్నారు కాని కో ఆప్టు చేసుకోబడిన వారుకూడా స్వలాభపరులతో కూడి భారాన్ని అధికం చేయరని నమ్మకమేమిటి.

ప్రస్తుతపు పారిభాషిక యుగంలో, హరిజనుల సమస్య, యితర వెనుకబడిన తరగతుల సమస్య, యేవిధంగాను సౌకర్యాలు పొందలేని తరగతుల సమస్య సాంఘిక సమస్యకాదు. అది కేవలం ఆర్థిక సమస్య. కాబట్టి హరిజన సమస్యని సాంఘిక దృక్పథంతో చూచుటసరికాదు. హరిజనుల ఆర్థిక సమస్య మిగిలిన వెనుకబడిన తరగతుల ఆర్థిక సమస్యతోనే పరిష్కారం కాగలదు. గ్రామాలలో రాజకీయ



మహాత్మాగాంధీ ఆత్మాహుతి జరిగిన జనవరి 30 న నూలు వడుకుతున్న సభ్యులు.



సమాచార కేంద్రంలో

పథాలు ప్రజాసేవ ముఖ్యంగా భోగసానుగావుండి మిక్కిలి అవసరంలోనున్న ప్రజలసేవలో మాత్రమే పోటీచేసే పరిస్థితులు కల్పించబడాలి.

## సహకారసంఘాలు

గ్రామాలలో పంచాయతీల స్థాయిలోనే చట్టబద్ధమయిన సహకార సంఘాలు వుండాలన్న సూచనను సభ్యులు చాలామంది బలపరచారు. ఫంక్షనల్ సహకార సంఘాలు గ్రామస్థాయిలో కాక బ్లాకుస్థాయి, ఇంకా అంతకుపై స్థాయిలో వుండాలనికూడా సూచించ బడింది. ఈ విషయం, ప్లానింగు కమిషన్ తరఫున కార్యాచరణ వర్గంచే తుణ్ణంగా పరిశీలించబడుతుంది.

సహకారాన్ని సమాజాభివృద్ధి శాఖామంత్రికి బదిలీ చేయుటతో ఆయనకు కష్టసాధ్యమయిన పని యెదురయినదని లోక్‌సభ సభ్యుడు శ్రీ ఎన్. ఆర్ మల్కానీ అన్నారు. ఈ విషయంలో జాగ్రత్తగా మెల్లిగా పని జరిపించాలని ఆయన మంత్రికి సలహా యిచ్చారు; కాని సహకార శాఖకు సంబంధించినంత వరకూ, ప్రస్తుతవ్యవస్థను సరిచేసి మంత్రిత్వశాఖ యేదో క్రొత్తదానిని సృష్టించాలన్నారు. యితర సభ్యులు కూడా మంత్రిచేయవలసిన భారమయిన పనిప్రసక్తి తెచ్చిమాట్లాడారు.

తమ ముగింపు ప్రసంగంలో యీ విషయం ప్రసక్తితెచ్చి జరుగబోయే సహకార మంత్రుల, అధికార్ల సమావేశం ముగిసిన పిమ్మట ప్రముఖ సహకార వేత్తల సమావేశాన్ని యేర్పరచుటకు తాము యిదివరకే ఆలోచించినట్లు శ్రీ ఎస్. కె. డే వెల్లడించారు. తమ దృష్టిలో ప్రభుత్వం నిర్ణయించిన అసందిగ్ధమయిన యే విధానానికయినా అనుగుణంగా ప్రభుత్వ యంత్రాంగం మారగలదనీ, కాబట్టి తమకు తీవ్రమయిన సమస్య యేమీలేదనీ అన్నారు. దానిని ముందు పనికి అనుగుణంగా సరిదిద్దవచ్చు, అయితే, గూఢంగాను, బహిరంగంగాను

కూడా పనిచేసే స్వప్రయోజన పరులు వున్నారనే భయం తమకూ కలదనీ, వారు సులభంగా లొంగరనీకూడా అన్నారు. తాము యీ సవాలును యెదుర్కొంటామన్నారు.

సభ్యుడు చెప్పిన యోగ్యమయిన ప్రయోజనాలకు పరపతి విషయంలో, కేవల అవసరంగా సిద్ధాంతలో అది యిదివరకే ఆమోదించబడిందన్నారు. ఈ అవసరాన్ని తీర్చుటకుగల శక్తిని బట్టి సహకారం సఫలమో విఫలమో కాగలదన్నారు. వ్యవసాయం విషయంలో, తమ కృషిని మొదట సర్వీసు సహకార సంఘాలపై కేంద్రీకరించ సంకల్పించామన్నారు. ఆర్థికాభివృద్ధికి సంబంధించిన విషయాలలో సంస్థల ద్వారాతప్ప స్టేట్ వ్యక్తులతో వ్యవహరించదనే విధానం స్పష్టంగా ప్రకటించబడాలని ఆంధ్రప్రదేశ్ ప్రణాళికల మంత్రి చేసిన సూచన విషయంలో, గ్రాఫ్టు, 'డిపార్టుమెంటల్ ఇంపీరియలిజం' వంటి ప్రస్తుతపు చెడుగుల నెన్నిటినో అది సరిదిద్దగలదని అంగీకరించబడింది. జాతీయాభివృద్ధి సంఘం దానిని సిద్ధాంతరీత్యా ఆమోదించింది. ఇంకా దాని అమలుకి అవసరమయిన కృషి చేయబడుతుంది.

బ్లాకు అభివృద్ధి సంఘం నిర్మాణం విషయంలో ప్రతి గ్రా. స్థా. కా. సర్కిలునుంచి తమనుంచి యిద్దరు ముగ్గురు సభ్యులను యెన్నుకొనుటకై పంచాయతీల పంచీలు, సిర్పాంచీలతో ఓటర్ల (ఎలక్టరల్) కళాశాలను యేర్పరచాలని సూచించబడింది. బ్లాకు అభివృద్ధి సంఘాల అధ్యక్ష, వుపాధ్యక్షులు నెలకొకసారి సమావేశమవాలనే విషయం యేకగ్రీవంగా ఆమోదించ బడింది.

విద్య, వయోజన విద్య పరస్పరం వేరు చేయబడకూడదు. గ్రామ పాఠశాల వుపాధ్యాయుడు ప్రజలతో సన్నిహితత్వమేర్పరుచుకుని వారి నైతిక భౌతిక సంపదల అభివృద్ధిలో తోడ్పడుటకై, కొంత కాలాన్ని వినియోగించాలి. బడిపిల్లలకు మధ్యాహ్న భోజనం సరఫరా చేయబడాలనే విషయం యేకగ్రీవంగా అంగీకరించబడింది. ఈ సందర్భంలో మద్రాసు



శిబిరంలో కవిసమ్మేళనము.



శ్రీ ఎస్. కె. డే బహిరంగసభలో ప్రసంగిస్తున్న దృశ్యం.

ప్రభుత్వం యిదివరకే తీసుకున్న చర్య ప్రశంసించ బడింది. ఇతర రాష్ట్రాలుకూడా అట్టి చర్యను గైకొనాలని చెప్పబడింది. తృతీయ ప్రణాళిక సమాప్తి నాటికి దేశమంతటా క్రమేణా నిర్బంధ విద్యను ప్రవేశపెట్టాలని ఆలోచించబడుతున్నది.

## శిబిరాలు

కేంద్రం సమాజాభివృద్ధి వుద్యమాన్ని గురించి చేసిన ఆలోచన యథాతథంగా భారతదేశమంతటా గ్రామాలలోని ప్రాథమిక సభ్యులకు అందించబడాలి. దేశంలోని సహకార సంఘాలన్నిటి సభ్యులుకూడా దానిని గ్రహించాలి. ఇందునిమిత్తం శిబిరాల రూపంలో శిక్షణా కార్యక్రమం చేపట్టబడాలి. ప్రస్తుత శిబిరం అట్టివాటిలో మొదటిది. ఈ పద్ధతిలోనే సమాజాభివృద్ధి కార్యక్రమంలో నిమగ్నులయిన అధికారులు, అనధికారులు యీ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోగలరు. ఈ వుద్యమం చరిత్రలో యిదొక నూతనాధ్యాయం కాగలదు. ఆ అధ్యాయం యిప్పుడు యీ శిబిరంతో ప్రారంభమయింది' "ఇందువల్ల ముందు ముందు యిప్పుడు మనం మెచ్చుకోలేని ఫలితాలు కలుగవచ్చు." ఇవి శిబిరం వీడ్కోలు సందర్భంలో శ్రీ ఎస్. కె. డే అన్నమాటలు.

శిబిరానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచేసిన యేర్పాట్ల పద్ధతిని మెచ్చుకుంటూ ఆయన యిలా అన్నారు: భారతీయ సాంప్రదాయం ప్రకారం తనకు మేలు చేసిన సోదరునికి సోదరుడు కృతజ్ఞత తెలుపడు; కాబట్టి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కృతజ్ఞత తెలిపి "అవమానించుట" నాకిష్టంలేదు.

## దేశందేశమే గమనిస్తున్నది

"ఆంధ్రప్రదేశ్‌లోని 20 సమితిబ్లాకుల ప్రగతిని దేశందేశమంతా ఆసక్తితో గమనిస్తున్నది" అని 21-1-59 న పట్టన్ చెరువు పంచాయతీ సమితి సమర్పించిన స్వాగతపత్రానికి జవాబుచెబుతూ ఆయన అన్నారు.

సమాజాభివృద్ధి పనిలో చూపుతున్న వుత్సాహం, పూనికలకు ప్రజలను ఆయన అభినందించారు. బల్వంత రాయ్ మెహతా కమిటీ నివేదికలోని వికేంద్రీకరణ కార్యక్రమం సమితి బ్లాకులలో విజయవంతంగా

అమలు జరుగుతున్నదని కూడా ఆయన అన్నారు. పంచాయతీ సమితి సభ్యులు తమ పిల్లలపట్ల యింకా యెక్కువ బాధ్యతను తీసుకోవాలన్నారు. ఆ ప్రాంతంలో కోళ్ల పెంపకం కేంద్రాలను, మత్స్య పోషణ కేంద్రాలను అభివృద్ధి పరచుట అవసరమని నొక్కిచెప్పారు.

మార్చి, ఏప్రిల్ లలో గ్రామపంచాయతీ యెన్నికలు జరుగగలవని సమితి సభ్యుల నుద్దేశించి ప్రసంగిస్తూ ప్రణాళికలు, అభివృద్ధిశాఖామంత్రి శ్రీ వి. బి. రాజు అన్నారు. సమాజాభివృద్ధి పనికి ఒక్క వ్యవసాయరంగంలోనే కాక చిన్నతరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమల రంగంలోకూడా యెంతో అవకాశమున్నది.

పార్లమెంటు సభ్యుడు శ్రీ మథురదాస్ మథుర్ సమితి అధ్యక్షుని అభినందిస్తూ ఆ పంచాయతీ సమితి బ్లాకు సమాజాభివృద్ధి రంగంలో యావద్భారత దేశానికే మార్గదర్శిగా వున్నదన్నారు. దేశమంతా 20 పంచాయతీ సమితి బ్లాకుల ప్రగతిని గమనిస్తున్నది. అవి సంతృప్తికరంగా పురోగమిస్తే మిగిలిన రాష్ట్రాలు కూడా యీ పథకాన్ని అమలుపరచగలవు. "మీ ప్రగతి మా ప్రగతి, భారతదేశం ప్రగతి" అని ఆయన ప్రసంగాన్ని ముగిస్తూ అన్నారు.

అంతకుముందు పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ రామచంద్రారెడ్డి స్వాగతోపన్యాసాన్ని చదివారు. అందులో యిలావుంది: దేశంలో ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక రంగాలలో అభివృద్ధికై మీరుకృషి సలుపుతున్నందున మనదేశం యీ ప్రాంతం వెనుకటి పరిస్థితిని గురించి యీసమయంలో కొంచెం మీకు తెలియ జేస్తాను. స్వాతంత్ర్యానికి ముందు యిక్కడ ఫ్యూడల్ నిరంకుశత్వం తాండవమాడేది. తరచు కరువులు సంభవించేవి రైతులు, కార్మికులు జీవితంలో విశ్వాసాన్ని కోల్పోయారు. ఏవిధమయిన ప్రగతికి యెట్టి ఆశకు ఆస్కారం వుండేదికాదు. సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని ప్రవేశపెట్టిన పిమ్మటనే ప్రజా బాహుళ్యంలో నూతన చైతన్యం కలిగింది. గ్రామ పంచాయతీలు యేర్పడ్డాయి. దాని పరిపాలనలోరోజు రోజుకీ అభివృద్ధి



సంగారెడ్డిలో పోలీసులు యేర్పాటు చేసిన ప్రదర్శనను తిలకిస్తున్న సభ్యులు.



శ్రీ ఎస్. కె. దే రాజేంద్రనగర్‌లో శిక్షితుల నుద్దేశించి ప్రసంగిస్తున్నారు

కనిపిస్తున్నది. ప్రజలలో ఒక నూతనోత్సాహం వెల్లివిరిసింది, ఒక కొత్త ఆశ చిగురించింది.

అధికారాన్ని ప్రజాస్వామ్య విధానంలో వికేంద్రీకరించుటకై తలపెట్టిన అడ్‌హాక్ పంచాయతీ సమితుల ప్రయోగం ఘనవిజయం కాగలదనీ, మేలిరకం సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి శక్తివంతమయిన సాధనం కాగలదని సమితి కార్యనిర్వహణలో మాకుగల కొన్ని నెలల పరిచయము నమ్మకం కల్గించింది. నిజమయిన అధికారం ప్రజా ప్రతినిధుల హస్తగతం కావడానికిది మార్గం చేయగలదు.

జా. వి. సే. దశలో, ప్రజలసహకారం ఆశించిన మేరకు లభించుట లేదని తరుచు ఫిర్యాదులు వచ్చేవి. కానియిప్పుడు పంచాయతీ సమితులు యేర్పడిన పిమ్మట, మాకు యీప్రాంతంలో ప్రజల సహకారం పూర్తిగా లభిస్తున్నది. అంతేకాదు సమితి కార్య నిర్వహణలో వారు ఆసక్తిని, పూనికను చూపుతున్నారు, అందువల్ల అధికారాన్ని ప్రజాస్వామ్యపద్ధతిలో వికేంద్రీకరించే యీ ప్రయోగం విజయం పొందుట తథ్యమని మాకు విశ్వాసం కలిగింది.

పట్టన్‌చెరువు పంచాయతీ సమితి సభ్యులు ఫిబ్రవరి 8 వ తేదీన ఆరోజు అక్కడమకాం చేస్తున్న పార్లమెంటు సభ్యుల్ని కలుసుకుని సమితి ప్రారంభం పిమ్మట సాధించిన ఫలితాలను గురించి వారు వేసిన ప్రశ్నలన్నిటికి జవాబు చెప్పారు. గడచిన 7 నెలల్లోను, అధికార్ల దృక్పథంలోను ప్రజల దృక్పథంలోను కూడా మార్పువచ్చిందన్నారు. క్రమంగా అయికమత్యం యేర్పడి వివాదాలు అంతరిస్తున్నాయి. నిర్దిష్టమయిన విషయాలలో పనిజరుపుటకై పంచాయతీ సమితులక్రింద వివిధ వుపసంఘాలు యేర్పరచబడ్డాయి. అభివృద్ధి కార్యకలాపాలన్నీ పంచాయతీల ద్వారా జరుగవలసిన ప్రస్తుత పరిస్థితులలో సమితికి పంచాయతులపై అజమాయిషీ అధికారం వుండాలని అంగీకరించబడింది. అభివృద్ధి

కార్యక్రమాల కవసరమయిన ప్రజల విరాళ విషయంలో, యివ్వవలసినసొమ్ము పరిమాణం విషయంలో . ముఖ్యంగా వెనుకబడిన తరగతుల విషయంలో మార్పులుచేయుటకు అవకాశం వుండాలన్నారు. ప్రస్తుతం ఆప్రాంతంలో వెట్టిచాకిరీ లేదన్నారు.

## శ్రీ ఎస్. కె. డే ప్రసంగం

శిబిరం ఆఖరురోజున బహిరంగసభ జరిగింది శిబిరంలోని వారి శ్రమదానంతో అనాచ్ఛాదిత మయిన వేదిక తయారు చేయబడినచోట జరిగింది ఆసభ. కేంద్ర సమాజాభివృద్ధి, సహకార శాఖామంత్రి శ్రీ ఎస్. కె. డే గ్రామస్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ సమాజాభివృద్ధి కార్యక్రమంలో ప్రజలు పాల్గొనవలసిన అగత్యాన్ని గురించి నొక్కి చెప్పారు. పార్లమెంటు సభ్యులను, శాసనసభ్యులను తమ కేంద్రానికి ఆకర్షించి, వారు అక్కడ ఉన్నప్పుడు శ్రమదానం మున్నగు పనులలో వారి సహకారాన్ని సంపాదించినందుకు పట్టన్‌చెరువు వాస్తవ్యులను ఆయన ప్రత్యేకం అభినందించారు. కాయకష్టాన్ని గౌరవించుట, సుహృద్భావం, ప్రేమ, స్త్రీ పురుషుల మధ్య విచక్షణారాహిత్యం యివి అభ్యుదయ సమాజాల ప్రధాన లక్షణాలన్నారు. ఈలక్షణాల లేమి వెనుక బడివుండుటను సూచిస్తుందన్నారు.

ఆయన ఆంధ్రుల నిర్మాణాత్మక మయిన గుణాల ప్రసక్తితెచ్చి స్వాతంత్ర్యసిద్ధి అనంతరం మొత్తం జాతిఅంతా పునర్నిర్మాణ కృషిని చేపట్టవలసిన అగత్యం యేర్పడిందన్నారు. మొత్తం ప్రజానీకమంతా హృదయ పూర్వకంగా సహకరించనిచో రాష్ట్రంలో ఒక ముఖ్యమంత్రి లేక మంత్రివర్గం, శా. స. సభ్యులు, పా. సభ్యులు, శా. మం. సభ్యులు యేమీ సాధించలేరన్నారు. శిబిరం జరిగిన వారం రోజులు ప్రజలతో యెంతో సన్నిహితంగా వున్నందున శిబిరం ముగిసిన పిమ్మట వారిని విడిచి వెళ్లడం కష్టమన్నారు. గ్రామీణులకు వీడ్కోలుచెబుతూ పట్టన్ చెరువులో అభివృద్ధి కార్యక్రమం యథాప్రకారం కొనసాగాలన్నారు. భావి భారత పౌరులయిన పిల్లలు ఆరోగ్య కరమయిన వాతావరణంలో పెరుగుటకు అవకాశం కల్పించ బడాలని నొక్కి చెప్పారు. పట్టన్ చెరువు బ్లాకు యిదివరలో చక్కని కృషి సలిపింది. యికముందు ఆస్థాయిని నిలబెట్టుకొనుటేకాక బ్లాకు ప్రాంతంలో పేదరికం, నిరక్షరాస్యత, అనారోగ్యకరమయిన పరిస్థితుల నిర్మూలనలో పూర్వంసాధించిన ఫలితాలను మించి సాధించాలి.

## కాయకష్టం విలువ

సమాజాభివృద్ధి మంత్రిత్వశాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బి. ఎస్. మూర్తి కూడా సభికుల నుద్దేశించి తెలుగులో ప్రసంగించారు. దేశమంతకీ అభ్యుదయాన్ని సాధించుటకై ప్రతివ్యక్తిఅర్జునునివలె ధైర్యంగా పని చేయవలసిన సమయమాసన్నమయినదన్నారు. సమాజాభివృద్ధి కార్యక్రమం భారతదేశ గ్రామాల అభివృద్ధికై వుద్దేశించబడిందన్నారు. ప్రజలలో ప్రతిఒక్కరూ నవభారత సైనికులని భావించుకోవాలన్నారు. అప్పుడు ఆ ఆశయం సిద్ధిస్తుందన్నారు.

ఢిల్లీ పా. సభ్యుడు శ్రీ కృష్ణనాయర్ కూడా హిందీలో ప్రసంగిస్తూ మన దేశ తక్షణావసరాలను, అభివృద్ధి కార్యక్రమంలో వారి పాత్రను ప్రజలకు జ్ఞాపకం చేశారు.

సభకి అధ్యక్షత వహించిన పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి సంగం లక్ష్మీబాయి ముగింపు ప్రసంగంలో యిలా అన్నారు: ఇట్టి స్టడీసర్కిల్ శిబిరాల యేర్పాటు ప్రధానాశయం పల్లెపట్టులలో జీవితాన్ని పరిశీలించుట; యింతవరకూ సాధించిన అభివృద్ధిని లెక్కకట్టుట; యింకా యెక్కువ సహకారాన్ని, శ్రమదానాన్ని సంపాదించుటకుగల అవకాశాలను పరిశీలించి గ్రామీణుల జీవిత పరిస్థితుల్ని మెరుగు పరుచుట. ఈ శిబిరంలో పాల్గొన్న కేంద్రమంత్రి, పార్లమెంటరీ కార్యదర్శి, తదితర పా. స., శా. స. స. లకు ఆమె కృతజ్ఞత తెలిపారు. పట్టన్ చెరువు పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ పి. రామచంద్రారెడ్డి వందన సమర్పణ చేశారు,

## రాజేంద్రనగర్ సందర్శన

సమాజాభివృద్ధి శాఖా మంత్రితో కలిసి పార్లమెంటు సభ్యులు ఫిబ్రవరి 2న రాజేంద్రనగర్‌లోని శిక్షణా కేంద్రాలను సందర్శించారు. మార్గమధ్యంలో వారు సాలార్‌జంగ్ మ్యూజియంను, గోల్కొండ కోటను కూడా చూచారు.

శిక్షణాకేంద్రాల ఆవరణలో కేంద్రమంత్రికి, పార్లమెంటు సభ్యులకు రాష్ట్ర ప్రణాళికల మంత్రి స్వాగతం చెప్పారు. ఆయన ఆ సంస్థల నిర్వహణ పట్ల సంతృప్తి ప్రకటించారు. అనధికారి దృక్పథాన్ని, వుద్యోగి కర్మశిక్షణను అలవరుచుకొమ్మని ఆయన శిక్షితులకు సలహాయిచ్చారు. సమాజాభివృద్ధి శాఖా మంత్రి శిక్షితులనుద్దేశించి ప్రసంగిస్తూ బ్లా. అ. అధికారివలె కాక ఒక జట్టు కెప్టెన్‌గా వ్యవహరించాలన్నారు. బ్లా. అ. అధికార్లు ప్రజలనందరినీ కలుపుకోలేరు కాబట్టి అభివృద్ధి కార్యక్రమంలో తోడ్పడుటకై ప్రజాసంస్థలను యేర్పాటు చేయాలన్నారు. ఆ ఆవరణలో త్వరలోనే జిల్లా పంచాయతీ అధికార్ల శిక్షణాకేంద్రం కూడా ప్రారంభింపబడగలదని కూడా ఆయన చెప్పారు,

పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎమ్. డి. మధుర్ శాసనకర్తల తరపున మాట్లాడుతూ ఆఖరికి సామాన్య మానవుడు తమ యజమాని కాగలడని గుర్తించమని శిక్షితుల నుద్బోధించారు. బ్లాకులలో వారి కృషిలో అన్నిస్థాయిలలోను వారికి సహకారం లభింస్తుదని ఆశించారు. పట్టన్ చెరువులో కార్మికుల సైన్యంలో చేరుటకు తన కానందంగా వున్నదనీ ఆ విధంగా తాను అభివృద్ధి కృషిలో శ్రేష్టతరమయిన కార్యకర్తగా తయారయేననీ ఆయన అన్నారు.



# ప్రభుత్వ ప్రచురణలు

1. ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
2. ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం ( ఇ* లేక తె* లేక ఉ* ) 0.12 న.పై.
3. ఆంధ్రప్రదేశ్ చేతి పనులు ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
4. ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి (ఉ*) 0.12 న.పై.
5. ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
6. ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు ( ఉ* ) 0.12 న.పై.
7. హైదరాబాదు నగరం, శివార్లు-గైడ్ (ఇ*) 0.50 న.పై.
8. హైదరాబాదు నగర పటం 0.12 న.పై.
9. ఆంధ్రప్రదేశ్ మత్స్యసంపద ( ఇ* లేక తె* ఉ* ) 0.12 న.పై.
10. ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమయిన స్థలాలు (ఇ*) 0.12 న.పై.
11. ఆంధ్రప్రదేశ్ స్థూల స్వరూపం (ఆంధ్రప్రదేశ్ యెట్ యెగ్లాన్సు) ( ఇ* ) 0.12 న.పై.
12. నూతన గ్రామాల నిర్మాణం-ఆంధ్రప్రదేశ్‌లో సమాజాభివృద్ధి ( ఇ* ) 0.12 న.పై.
13. ఆంధ్రప్రదేశ్ – ధాన్యాగారం - ( ఇ* ) 0.12 న.పై.
14. ఆంధ్రప్రదేశ్ డెయిరీ రూ. 5/-

*గమనిక:*—ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

షరా:- పోస్టేజి అదనం.

*ఇ = ఇంగ్లీషు
*తె = తెలుగు
*ఉ = ఉర్దూ

ప్రతులకై
ప్రచురణల విభాగం, సమాచార,
పౌరసంబంధాల డైరెక్టరు కార్యాలయం,
హైదరాబాదు 1.
చిరునామాకు వ్రాయండి.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్నమొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

*భారతదేశం యొక్క*

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

*మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| **12** సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు | పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. |
| **10** సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅక్కౌంట్లు | రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది. |

15 సంవత్సరముల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు: రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300 రూ. 26,600. | ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది.<br>వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకు కొనవచ్చు. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

## భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, యీ పెట్టుబళ్ళకి సంబంధించిన నిబంధనావళికొరకు:

నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకికాని లేక

రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)

చిరునామాకి కాని వ్రాయాలి.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు



'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10½ × 8½" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,<br>
సమాచార, పౌరసంబంధముల శాఖ<br>
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం<br>
హైదరాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06 041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42 912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 298 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... | రూ 175.37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ 63.66 కోట్లు |
| వ్యయం | ... | ,, 62 87 , |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, 21 29 , |

